శ్రీరస్తు!

శ్లో॥ శ్రీకళ్యాణ గుణావహం రిపుహరం దుస్వప్న దోషావహం।
గంగాస్నాన విశేష పుణ్య ఫలదం గోదానతుల్యం నృణాం॥
ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతానసంపత్ప్రదం।
నానాకర్మ సుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతాం॥

శుభమస్తు!!

# శ్రీ మన్మథ నామ సంవత్సర

## సూర్య సిద్ధాన్త పుష్పగిరి మహాసంస్థాన పఞ్చాఙ్గమ్ - ౨౫

కృష్ణాది గతాబ్దాః 195, 58, 85, 116
శాలివాహన శక గతాబ్దాః : 1937
కలియుగ గతాబ్దాః : 5116



భాగ్యనగర దేశాంతర యోజనం - 21
గోల్కొండ విషువచ్ఛాయ : 3-37 17-20 ఉత్తర
అక్షాంశము 78.27 తూర్పు రేఖాంశము

ఈ పఞ్చాఙ్గమ్ కాశ్యపసగోత్రజుడు శ్రీ జగద్గురు శంకరాచార్య పుష్పగిరి మహాసంస్థాన సిద్ధాంతియు బ్రహ్మశ్రీ త్రిపురారి రామకృష్ణ సిద్ధాంతిగారి ప్రియ శిష్యుడును బ్రహ్మశ్రీ బ్రహ్మభట్ల అయోధ్యరామశాస్త్రి కనిష్టపుత్రుడు



ఉత్తమ పంచాంగకర్త జ్యోతిషరత్న
**బ్రహ్మభట్ల శ్రీరామశర్మ**
సిద్ధిపేటచే గుణించబడినది
గణిత సహాయకులు బ్రహ్మభట్ల శ్రీనాథశర్మ



ఈ తెలంగాణ పంచాంగం గోల్కొండకు గుణించబడినది

# రజతోత్సవ పంచాంగం

వెల 55/-

---




శ్రీరామ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, మ.నగర్

# ముందుమాట



విజ్ఞానంబ్రహ్మేతివ్యజానాత్
అంతర్బహిశ్చ తత్సర్వం, వ్యాప్యనారాయణ స్థిత

పరమేశ్వరస్వరూపులైన విజ్ఞులు మా ఆప్తులు. పంచాగ శ్రేయోభాలాషుల ప్రేమాభిమానములతో నాకు తెలిసిన పంచాంగ విజ్ఞానమేగాక, పంచాగ గణిత మూలములు మిగతాశాస్త్రముల అనుసంధానముతో 25సం॥ల నుండి సకాలమందు అందించుచున్నాను. విజ్ఞులు, ఔత్సాహికులు, ఇంకావివరములు తెలుసుకొనగోరువారు ముఖాముఖిగా తెలుసుకొని మీమీ సమయానుకూల ప్రజ్ఞతెలుసుకొని మీమీ సమయానుకూల ప్రజ్ఞతో ప్రజలకు తెలియజేయగలరనియు, నేను పంచాంగంద్వారా వ్రాసినది కొద్దిమందికే పరిమితమగుచున్నదని భావించి. ఎవరు ఏ విషయము (శాస్త్ర) పరిధిలో అడిగినను మహాప్రసాదముగా భావించి తెలియజేయవలెనను ప్రబలమైన కాంక్షతో పంచాంగ గణితము చేయుచున్నాను. ధనార్జనకు కీర్తి ప్రతిష్ఠల నిమిత్తంకాదు. అన్ని విషయములు విస్తారముగా వ్రాయుటపంచాంగ పరిధికాదు. పంచాంగమందు ప్రతి విషయముస్పృశించుటయే జరుగును.

25 సం॥ రజితోత్సవముగాభావించి ఇంతకు పూర్వము నేను పంచాంగములలో వ్రాసిన విషయములు అందరికి అందలేదను భావనతో ఇత: పూర్వము వ్రాసినవాటిని మరికొన్ని కొత్తవి మేళవించి వ్రాయుచున్నాను. ఇది పునరుక్తిదోషముగాదు. ధనమూలమిదమే జగత్తు.

గణితము చేయుటకుగాని, తెలియచేప్పుటకు గాని ధనవ్యయముగాకున్నను ముద్రించుటకు ఈనాటి ధరలననుసరించి చాలా వ్యయమగుచున్నది. నేను బ్రాహ్మణుడనే కాని వ్యాపారస్థుడను కానందున అట్టి వ్యయముభాగమగుచున్నది. సర్వజనులకును, ఏ కొద్దిపాటి విజ్ఞానమున్న వారికైనా అర్థమగునట్లు వ్రాయబడుచున్న మా పంచాంగంను ఆదరించి ప్రేమాభిమానములతో గోదావరి ఎండకుండా ఉండుటకు గ్లాసుతో కడవతో అక్కడక్కడ నీరు పోసిన ఆగకుండా ప్రవహించునట్లు మా పంచాంగం నిధికి, రూ॥ 2000/-గాని ఒక సం॥నకు రూ॥100/-గాని హితోధిక సహాయముతో ఆదరించగలరని ఆశిస్తూ...

సర్వేజనా: సుఖినోభవంతు

బ్రహ్మోభట్ల శ్రీరామశర్మ దైవజ్ఞులు
ఉత్తమ పంచాగకర్త
1-4-73 గీతాభవనంవద్ద పారుపల్లివీధి,
సిద్దిపేట.(08457.224142) సెల్.9030344513.



# బతుకమ్మ పండుగ విశేషము

ఇది తెలంగాణ రాష్ట్ర పండుగ నిజాం నవాబు పాలనలో గల ప్రదేశమందే ఉన్నది. ఈ పండుగ ఈ ప్రాంతమందు పూర్వాచారము ననుసరించి జరుపుకొనుచున్నారు. ఇది శాస్త్ర బద్ధమైనది కాదు. కావున ధర్మశాస్త్రమందు గాని, పురాణములో గాని, వ్రత కల్పములో గాని, నవరాత్ర విధానములో గాని చెప్పబడలేదు. ఆడపడుచులు పుట్టింటిలో తమ బంధు మిత్రులతో సంతోషముగా గడుపుటకు నిర్ణయించబడినది. కాని దీనికి దుర్గాష్టమి రోజు చద్దుల బతుకమ్మయని, అమావాస్య రోజు ప్రారంభించవలెనని గాని, తిథి వ్యాప్తి వుండవలెనని గాని ఎక్కడా లేనందువల్ల కొందరు దీనిని దుర్గాష్టమి అని వక్ర మార్గములో చెప్పుట గర్హనీయము.

బతుకమ్మ తెలంగాణ గ్రామీణ పండుగ, నిరుపేదలు మొదలు ధనికుల వరకు అందరు ఆచరించుటకు యోగ్యముగా ఉండును. ఈ ఉత్సవమునకు ఎటువంటి ధన వ్యయము లేకుండా ప్రకృతి సిద్ధమైన వాటితోనే అనగా అడవి యందు బీడు భూములలో ఉండు తంగేడు పూవులను, గునుక పూవులను, చామంతి పూవులను, గడ్డిపూవులను, గుమ్మడి ఆకులు, పూవులను, కట్ల పూవులను, రుద్రాక్ష పూవులతో నిర్మింపబడును. రంగురంగులుగా శ్రీ చక్రం వల్లె ఉండును. పట్టణములలో అడవి ప్రాంతము దూరముగా ఉండుటచేత ఎక్కువ ప్రచారములో ఉండదు. ఈ సం॥ తేది 12-10-2015 నుండి 20-10-2015వరకు జరుపబడును. ప్రతి రోజు దూప, దీపం అర్పించి ఏరోజుకు కారోజు కొత్తగా నిర్మాణము చేస్తూ చివరి దినము పులిహోరలు, అపూపములు, నైవేద్యములు ఇచ్చి సంతోషముతో వీడుకుందురు.

కొన్ని గ్రామములో అమవాస్య మొదలు 7 రోజులకు చద్దులు గాని, కొన్ని గ్రామముల యందు బహుళ త్రయోదశి నుండి 15 రోజులకు చద్దులుగాను, ఇంకొన్ని గ్రామములో 21 రోజు చద్దులుగా ఆచరించు చున్నందున దీనికి ఆరంభ సమాప్తి నియమములు లేవు. ఈ పండుగ హిందు మతస్తులదే దీనిని పితృ దేవతల (పెతర అమావాస్య) పూజానంతరం ఆడపడచులను గౌరవించు ఉద్ధేశముతో అమ్మవారి నవరాత్రములలో లక్ష్మీ రూపంలో పూజించుట నిర్ణయించినారు. కావున పెద్దలు తమ తమ గ్రామములో పూర్వాచారముగా వచ్చువిధానము ననుసరించి జరుపుకొనగలరు. కొందరు తమ ఆధిపత్యము కొరకు పూర్వాచారమునకు భిన్నముగా చెప్పుదానిని పాటించకూడదు.



# శుభముహూర్తములకు సూచనలు

ఈ ముహూర్తములు మాకు లభ్యమైనప్రామాణిక గ్రంథములయందుగల ప్రమాణములననుసరించిచూపబడుచున్నవి. వీనిలో స్వల్ప దోషములే ప్రమాణముగ తీసుకొని నిరాకరింపవచ్చును. అధిక శుభముల యొక్క ఉచితా నచితములు గ్రహించి ఆచరించవచ్చు. ఉత్తరాయణమందు మాఘాదిపంచకములే శుభకార్యములు చేయుటకు యోగ్యములు. కావున స్వల్పదోషముల అన్వేషించి, వాటినే చూపి శుభకార్యములకు ఆటంకములు చేయక మంచిని గ్రహించి పూర్ణ హృదయముతో తర్క వితర్కములుచేయక, కర్తల విశ్వాసమును అనసరించి ఎవరి వారి ప్రాంతీయ దేశాచార, కులాచార, మతాచారముగా శుభకార్య నిర్వహణ సౌలభ్యములను దృష్టియందు ఉంచుకొని వాటికి అనుకూలముహూర్తములు నిర్ణయించుకొనుట సకల జనులకు శ్రేయస్కరమగునట్లు చెప్పుట గౌరవప్రతిష్ఠాప్రదము.

ఈ ముహూర్తములు సూచితములే కాని నిర్ణయములు కావు. పండితులు విజ్ఞులు తమ విజ్ఞాన పరిధిలో చేర్పులు మార్పులు చేసుకోగలరు. వీటి ప్రమాణములు కాలమృతము 86వ పేజీ 102,103, శ్లోకములు) స్వల్పదోషములు సౌరాష్ట్ర, అంగ, వంగ, కలింగ, అవంతి, మగధ, కాశ్మీర, ద్రావిడ, సాల్వ, కురు మ్లేచ్ఛ, బాహ్లిక దేశములకు పనికిరావు. మిగిలిన దేశములందు దక్షిణ దేశములందు విచారింప పనిలేదు. గురు, శుక్ర, బుధ, గ్రహములలో ఏ ఒక్కరైనను వివాహసమయమునకు స్వోచ్ఛ మూల త్రికోణ, మిత్రక్షేత్ర, స్వక్షేత్రమునందు అయినను లగ్నమునకు 4-5-9-10-11న వుండినను అద్భుత సంఖ్యా కంబులకు దోషములను పోగొట్టును సందేహములేదు. (శ్లోకము 105లో) బ్రహ్మావా పరిషత్తు, మంత్రసకలాన్, దోషాన్ సమర్థోనహి॥ (తా॥) స్వల్పదోషములైన లేక ఉండేది లగ్నము నిర్ణయించుటకు బ్రహ్మకైనను వశము కాదు. మనుజులమైన మనము ఎంతటి వారము. కావున స్వల్ప దోషమునున్నను అధిక గుణములు గల ముహూర్తములు గ్రహించుటయే విజ్ఞత.

ఏకాదశార్కంగా నిర్ణయించినముహూర్తములు వేయి దోషములు హరించును. ఉదయాది నాల్గవ లగ్నం అభిజిత్ సర్వ దోషములు హరించును. ఉదాయాత్పూర్వలగ్నం ఉషఃకాలలగ్నమనియు, సప్తమలగ్నం, గోధూళిలగ్నమనియు నాల్గవ ముహూర్తము అభిజిన్మహూర్తమనియు ఇవి అన్ని దోషములు హరించునని శాస్త్రజ్ఞుల వచనములు. లగ్నమందు శుక్రుడుండిన పదివేల దోషములనైనా హరించును సోమవారం వివాహము శుభప్రదమని నిర్ణయ సింధువులో ఉన్నది.

రాత్రి ముహూర్తములకు వారదోషము ఉషః ముహూర్తములకుతిథి దోషము, అభిజిత్ లగ్నము నక్షత్ర దోషము, గోధూళి లగ్నం యోగదోషములు ఉండవు. రాత్రి లగ్నం నిర్ణయించుకొనిన వారదోషము, ఘాతవారము, దుష్టవారములు దోషములు కావు. వివాహమునకు ఘాత వార దోషం లేదు. (పూర్వకాలామృతం).



# విజ్ఞానం బ్రహ్మాదివ్య జనాత్

## గణితవిజ్ఞానం

1. గణిత మెందుకు పుట్టినది. 2.ఎప్పటి నుండి పుట్టినది. 3. దీని ఆవశ్యకత ఏమిటి. 4. ఎలాఉపయోగ పడుతున్నది. సృష్టి ప్రారంభమందు విష్ణు దేవునియందు బ్రహ్మ పుట్టిన తదుపరి బ్రహ్మకు సృష్టి చేయు అధికారము 100సం॥ల ఆయుర్దాయం ఇచ్చెను. తదుపరి వేరే బ్రహ్మ వచ్చును. ఈ బ్రహ్మ వయస్సు తెలుసుకోకున్న తదుపరి సృష్టికాలం తెలియదు. కావున బ్రహ్మ వయస్సు తెలిసుకొనుటకు గణితము పుట్టినది. అప్పుడే సంకల్ప సృష్టి ద్వారా పంచభూతములు, రవ్యాది గ్రహములు, ఇంద్రాది దేవతలు, జన్మించిరి. గాలి కదలికతో కాలగమనము (లెక్క) గణితము ప్రారంభమైనది.

ఇది 2విధములు, కూడిక, తీసివేత, ఈరెంటితోనే సమస్త గణితంచేయవచ్చును. పెంచుతూపోవడము జమ అనియు, ఇవి చాలామార్లు పెంచవలసినపుడు హెచ్చించు (గుణకారం)ట, అనిసూక్ష్మీకరించిరి. మిగిలినవి తెలుసుకొనుటకు తీసివేయవలెను. దీనిని భాగహారముగా సూక్ష్మీకరించిరి, ఆధునీకమందు కంప్యూటర్, కాలిక్‌లేటరు. తయారు చేయబడి మనకు ఉపయోగపడుచున్నవి. ఇక బ్రహ్మ సమయమును భాగంచి భగణములని మానవ జీవనమునకు సరిపోవునట్లు సూక్ష్మీకరించి అందించినారు.

బ్రహ్మ ఆయుఃప్రమాణం మానవ గణితమునకు చాలా పెద్దదిగా యుండుటచే శాఖోప, శాఖలుగా, చెప్పబడినది. వేద ప్రమాణము నను సరించి, తక్షత్యేక పదీ ద్విపదీ పా చతుష్పదీ, అష్టాపదీ, నవపదీ, బభూషీ: ఋగ్వేదము చెప్పబడినట్లు అనగా ఏక పదీ 1, ద్విపదీ2 కలుపగా 3సాచతుష్పదీ4చేగుణం. 12 అష్టాపదీ 8. గుణం 96. నవపదీ9. గుణం 864 సహసాక్షరా, మానవునకు 864కోట్ల సం॥లుబ్రహ్మకు ఒకరోజు పగలు 432కోట్లు రాత్రి 432 కోట్లు దీని ఆధారముగానే సూర్య భగవానుడు మయునకు చెప్పినవిధానము రవ్యాదిసప్త గ్రహ గతులనాధారముగా ఋష్యాదులచే సూక్ష్మీకరించి చెప్పబడినది పూర్వ సిద్ధాంత పంచాంగం

## అంగారకుని వివరములు

కు అనగా భూమి జు అనగా పుట్టినవాడు...భూమి పుత్రుడు ఇతడు రుద్ర శ్వేదమువలన జన్మించినవాడు శివునికి బభ్రుస్సమంగళ: అని, న మక పాఠం శివుని పుత్రుడైనందున మంగళుడైనాడు ఈమంగళ శబ్దమునకు శివుడు లక్ష్మీదేవి మంగళములను ప్రసాదించు వాడని చెప్పబడినది సుమంగలీరియం అన్నిమంగళములను ఇచ్చువారు కావుననే ముత్తై దువలు శ్రావణ మాసమందు మంగళ కర సౌభాగ్యం పొందుటకై మంగళగౌరీ వ్రతం ఆచరించ వలెను. కుజ శుక్ర సంయోగము గల జాతకులు ద్వి కళత్ర ద్విభర్తృక లేక బహు భర్తృకా బహుభార్యా వ్యభిచారయోగంలు కల్గును అగ్నిర్మూర్ధా దిన:కకుత్పతి పృధివ్యా: అయం అపాగుం రేతాగం సిజిన్వతీ ఇతడు అగ్ని రూపుడై దహించు వాడైనాడు.

కనుక కుజ ప్రభావం చూపును. వీరితో విరోధించడం విష సర్పాగ్నుల మధ్య యున్నట్లుండును.

అంగారక: కృష్ణ వేణి లంకా మధ్యేచ అనుప్రమాణం ననుసరించి శ్రీలంకనుండి ఉత్తరభాగం (విజయ వాడకు) కృష్ణానదికి దక్షిణం అంగారక మండలాది సత్యదేశమగుచున్నది. కావున ఇక్కడి ప్రజలపై కుజ ప్రభావం చాలా ఉండును.

వీరంతా ఇహలోక సుఖ భోగ ప్రియులుగా ఉంటారు. వీరు అగ్ని సంబధమైన గుణములు కలవారుగాఉందురు. రామాయణ కాలమందు ఈప్రాంతమంతా ఖర దూషణాదులచే శూర్పణఖలచే నర మాంసంలను తినుచు యజ్ఞయాగములను, మునులను ధర్మమును నాశముచేసిరి. ఈ ప్రాంతీయులకు కామ వాంఛ మెండుగా యుండుటయేకాక మకార పంచకము ఎక్కువ. అనగా మద్యము, మాంసము, మత్స్యము మైధునం, ముద్ర, ఇవి అధికము. వీరికి ఆలోచనా శక్తి తగ్గి అహంకారం పెరుగును దానివలననే మన ఆంధ్ర దేశ ప్రజలు తేజ శక్తినికోల్పోయి అజ్ఞానమునే విజ్ఞానముగా భావించి వెఱ్ఱివారగుచున్నారు. కావున అంగారక గ్రహ జప, పూజా, స్తోత్రపఠనం, హోమాదులు, సక్రమముగా చేసినచో, ఋణ, బాధలు, ఆర్థిక, ఉద్యోగ, కుటుంబ సమస్యలు, భయములు, జైలు, శిక్షలు, సమస్త వ్యాధులు, తొలగి సంతానవంతు లగుదురు.

## వారము (విశ్లేషణ)

ఇదినేను చూచిన గ్రంథములలోని సారము నా విజ్ఞాన పరిధిలో వ్రాయబడుచున్నది అర్థము, నానాఅర్థములు వృఞ్ వరణే వార సూర్యాది దివసే, 2, వారశబ్దమునకు సమూహమునకు ప్రియత ఇతి వారం అనుసంధానము చేయుట ద్వి2 1వారం (ద్వారం) వారం 7రోజులు వారం 1రోజు, వారం వారం మరలమరల అని ఎన్నియో అర్థములు కలవు.



**ఉపయోగములు:-** ఇవి ఖగోళమందలి గ్రహములపై సూర్యతేజస్సును అనుసరించి తేజస్సును భూమికి అను సంధానము చేసి అగ్రహము యొక్క నామును నాటి వారముగా వేద ప్రమాణం ఉదయాదుదయం వారమని నిర్ణయించిరి ఇది కాలగణితమందు అన్ని దేశముల వారు ప్రపంచవ్యాప్తముగా వాడుకొనుచున్నారు. తేదీలు, తిథులు మొదలగువాటిని వివిధ పేర్వతో వాడుకొనినను. వారమునకు మాత్రము భారతీయ శాస్త్రవిధానముగనే అన్నిమతములవారు గణితము చేయుచున్నారు.

**వారనిర్ణయం:-** సూర్యసిద్ధాంతములో చెప్పబడిన ప్రకారం గ్రహమధ్యగతుల అనుసరించి సూర్య భాగం, చంద్రభాగం గ్రహమండలములు చెప్పబడినవి. ఎక్కువ గతియున్నది భూమికి దగ్గరగాను అన్నిటి గతుల ప్రకారం వారి మండలముల నిరూపించబడినది.

**ఉదా:** ఆది, సోమ వరుసలు ఎలా వచ్చినవో పరిశీలింతుము.




ఇవి గ్రహములు ననుసరించి ప్రారంభించబడినది. ప్రారంభమందు అన్ని శూన్యము (౦సున్న)లే రవ్యాది సప్తగ్రహములు మేషలగ్న ప్రారంభంనుండి సూర్యరశ్మి భూమిపై ప్రసరించినది మొదలు ప్రారంభం ఆది నుండి (సూర్యుని నుండి) మొదలు అనగా ఆదివారముతో సృష్టిగణితము ప్రభవమొంది ప్రభవనామ సంవత్సరము తిథి శూన్యం నుండి 1వ తిథిగా గ్రహములన్నియు (పాడ్యమి) మేషమందు నుండుటచే అశ్వినీనక్షత్రంతో ప్రారంభింపబడినది. క్రీస్తు శకం:- రక్తాక్షి నామ సంవత్సరం పుష్య శు॥ ౧౧ ఆదివారం కలిగతం3101 న ప్రారంభమైనది.

ఈచిత్రపటముననుసరించి సూర్యకుటుంబం రవి, కుజ, గురు, శుక్రలతోను చంద్రకుటుంబం, చంద్ర, బుధ, శుక్రలతో ఏర్పడినది. ప్రభవ సంవత్సరం పాడ్యమితిథి, ఆదివారం, అశ్వినీనక్షత్రములు ఒకటి సంఖ్యగా గుణించుట జరుగుచున్నది. ఇది మూలముగా ప్రపంచమందు అంతటను ఆదివారమును సృష్టి మొదటివారముగా పండుగదినం జరుపుకొనుటకు భార్యపిల్లలతోను కుటుంబంతోను ఉల్లాసముగా విందు భోజనము చేసుకొనుటకే ప్రభుత్వకార్యాలయములు, కార్మికులకు వ్యాపారాది అన్ని సంస్థలకు విశ్రాంతిరోజుగా ప్రకటితమైనది.,

## గ్రహముల ఉత్పత్తి - మౌఢ్యములు

సర్వ సృష్టికి మూలం వేదం, దాని కొన్ని వివరాలు తెలుపునది శాస్త్రము, శాస్త్రముకన్న వేదవిదితమే ప్రమాణము. చంద్రమామనసోజాత: చక్షోసూర్యోఅజాయత (శృతి పురుష) సృష్టాదిలో బ్రహ్మచక్షువుల నుండి సూర్యుడును. మనస్సంకల్పముతో చంద్రుడును ఉద్భవించిరి. (మనస్సు చల్లనిది ప్రవృత్తి చంద్రుడు చల్లని వారే) అలాగే తేజోభూఖాంబువాతేభ్య: క్రమశ: తేజస్సు అంశతో కుజుడు, (అగ్ని) భూ: అంశతో బుధుడు ఆకాశము గురువు. నీటితో శుక్రుడు, వాయువుతో శని యుద్భవించిరని ప్రమాణము, ఈ గ్రహ ఉత్పత్తి ఈ గ్రహములు, దేశబేధము ననుసరించి వాడుకలో కలవు. యమునా తీరవాసులు కుజుని, కైలాస ప్రాంతీయులు శనిని శుభ గ్రహములుగా వాడుకొందురు. అస్తమించిన గ్రహముకు మూఢమనియందురు. మూఢమందున్న గ్రహములు ఫలితమునీయవు. రవ్యాది సప్త గ్రహములకు మూఢము లుండును.

రవి : రవి అస్తమించియున్నపుడు, (రవి మౌఢ్యం) ప్రతి రోజు 12 గం॥ యజ్ఞము, యాగము, అగ్ని ప్రతిష్టా, చౌలం, గంగాస్నాం, క్షౌరము, పిండ ప్రదానములు చేయగూడదు.

చంద్ర : చంద్రాస్తమయం (అనగా బ 14-30 శు॥ 1) మూడు రోజులు గర్భాదానము మొదలు ఏ శుభకార్యములు చేయగూడదు.

కుజ : కుజాస్తమయం (కుజ మౌఢ్యం) ఇతడు సామవేదాధిపతి కావున సామవేదీయులు యమునా తీర వాసులు శుభకర్మలు చేయగూడదు. మిగతా వారికి దోషం లేదు.

బుధ : బుధాస్తమయం (బుధ మౌఢ్యం) హిమాలయ ప్రాంతీయులు శుభకర్మలు చేయరాదు. మిగతావారు, వ్యాపార, గణిత శాస్త్ర జ్యోతిష విజ్ఞాన ప్రదమైనవి పనికిరావు.

గురువు : గురువు అస్తమయం (గురుమౌఢ్యం సం॥ ఒక నెల) ఈ సమయమందు గర్భాదానాది కర్మలు శుభ కార్యములు చేయగూడదు.

శుక్ర : శుక్రాస్తమయం (శుక్రమౌఢ్యం) ముందుచక్రంలో 9 రోజులు రుజుగతిలో 72 రోజులు) ఈ సమయంలో కూడా సమస్త జనులు సమస్త శుభకార్యములు చేయగూడదు.

శని : శన్యస్తమయం (శని మౌఢ్యం) కౌలాస దేశీయులు, ఔత్తరాహీయులు, శుభ కార్యములు చేయరాదు. ఇనుము మొదలు వాహనములు కొనుగోలు వ్యాపారములకు దోషము.



## పంచాంగ వివరణ

ప్రతి నిత్యము మనము చేయు ప్రతి పూజయందు వ్యవహారాది కాలగణన పంచాంగ మందు ఐదు మానములు ఇమిడియున్నవి.

వివరణ: ప్రభవాది నామములతో బార్హస్పత్యమానం, మేషాది రాసుల రవి సంచారంతో సౌర మానము (ఇది ఇంగ్లీషు క్యాలెండర్) జీత భత్యములు చెల్లించుటకు సావన మానము. నక్షత్రాదుల వలన నక్షత్ర మానం, చైత్రాది మాసములు, చాంద్రమానముచే పంచాంగము వాడుకలో కలదు. ఏ మానము ఎప్పుడు ప్రారంభం మనం ఎక్కడ ఎలా ఉపయోగిస్తాం?

**1. బార్హస్పత్య మానం :** ఇది వింధ్యకు ఉత్తర దేశస్తులకు ముఖ్యం. దీని వలన ప్రభవాది అరవై సంవత్సరాలు ఏర్పడినవి. ఈ అరువై సంఖ్యతోనే నేటి కాల గణన (ఒక గంటకు అరువై నిమిషములని) గురువు ఒక రాశి నుండి ఇంకో రాశికి మారినప్పుడు కొత్త సంవత్సరము ప్రారంభం. ఇది చాంద్ర సంవత్సరము కంటే 12సం॥లు మందు గలదై యుండును. దీనిననుసరించి ఏ కర్మలు చేయబడవు.

**2.సౌరమానము :** ఇది శ్రీశైల దక్షిణ దేశములంయందు ముఖ్యం. రవి మేషరాశిలో ప్రవేశించినప్పుడు ప్రారంభమగును. సౌర సంవత్సరమునకు 365 1/4 రోజులు. దీనిని ప్రమాణముగా తీసుకొని ఆంగ్లేయ క్యాలెండర్ మనము చూచుచున్న దానిని రూపొందించినారు. పంచాంగమందు దీనిని ఋతువుల, ఆయనములు, గ్రహ మౌఢ్యములందు గ్రహణమందు మరియు దిన, రాత్రి ప్రమాణ నిర్ణయమందు వాడబడును. సౌరమానమందు అదిక మాసం ఉండదు. కావున ఏ చాంద్ర అధిక మాసమందు గ్రహణములు సంభవింపవు. ప్రభుత్వమునకు సౌరమానం ప్రమాణం.

**3. సావన మానం :** ఇది కాల గణనయందు ప్రధానంగా ఉపయోగపడును. రవి ఉదయించినది మొదలు మళ్లీ రవి ఉదయించువరకు ఒక సావనదినము. ఇవి 360 దినములకు సావన వత్సరమగును. దీనిచే యుగాదుల గణన, మాసాదుల గణన, జాతాశౌచ, మృత శౌచమందు, గర్భిణీ దినములకు వడ్డీ చెల్లించుటకు గ్రహ దినగతులు జీత భత్యములు చెల్లించుటకు వాడబడును. ఈ ప్రమాణాధారముగానే ప్రభుత్వము ఉద్యోగులచే 365 రోజులు పని చేయించుకొని 360 రోజులకే జీతభత్యములు చెల్లించు చున్నది. కాని 5 రోజులకు ఇచ్చుట లేదు.

**4. నక్షత్ర మానం :** ఇది తూర్పున అశ్విని నక్షత్రముదయించునది మొదలు మళ్లీ ఉదయించు వరకు గల కాలము 359 రోజులు నక్షత్రమానముతో జన్మనామము,

దశాంతర్దశలు, దశాభుక్తులు, తారా బలము చూచుట, శుభాశుభ ముహూర్తములు, జాతకములు చూచూటకు ఉపయోగపడును.

**5. చాంద్ర మానం :** చాంద్ర మానము. రవి, చంద్రుల కలయిత. అమావాస్య నుండి మళ్ళీ అమావాస్య వరకు ఒక మాసము. మాసమునకు 291/2 దినములు. దీనిని తిథులందురు. సంవత్సరమునకు 354 రోజులు, 11 ఘడియలు, 38విఘడియలు, పూర్ణ చంద్రుడు ఉన్న నక్షత్ర నామమే మాసనామముగా యుండును. సమస్త శుభాశుభ కర్మలయందును, నిత్య, నైమిత్తిక కామ్య కర్మ వ్రతానుష్టానములయందు, సమస్త పూజలయందు, శ్రాద్ధాది ప్రేత కర్మలాచరించుట యందు వాడబడును. పై నాలుగు మానములు ప్రధానం కలవారు కూడా చాంద్రమాన తిథి, వార, నక్షత్ర, యోగకరణములనే ఆచరింతురు. ఇది శ్రీశైలం, ఉత్తర దేశము వింధ్యా, దక్షిణ దేశములకు ప్రాధాన్యం. మహమ్మదీయులకు చాంద్రమానమే ప్రమాణము.

## 1 జనవరి నూతన సంవత్సరమా (?) శుభాకాంక్షలు !

క్రీస్తు శకం 1500 ఎ.డి. వరకు మార్చినెల నుండి సంవత్సరారంభముగా క్రైస్తవ దేశములయందు వాడుకలో ఉండెను. దీనిని బలపరచు ఆధారము సంస్కృత సంఖ్యలను మాస సంఖ్యలుగా మార్చి మొదలు 7 సప్త (సెప్టెంబర్) 8 అష్ట (అక్టోబర్) 9నవ (నవంబర్)10 దశ (దశంబర్) ప్రస్తుతం మాస సంఖ్య మార్చినను ఇవే పేర్లతో వాడుకలోను ఉన్నవి. వారు కూడా సూర్య సిద్ధాంతానుసారమే చాంద్రసౌరమానములనే ఆచరించిరి. ఈ సిద్ధాంతానుసారము మార్చి 15 నుండి ఏప్రియల్ 13లోగా మన సంవత్సరాది వచ్చును. చాలా మంది పాశ్చాత్య మేధావులు ప్రతి సంవత్సరము ఒకే తేదీన సంవత్సరాది రావలయునని కోరుకొనిరి. అది సాధ్య పడలేదు. అప్పుడు భారతీయ సూర్య సిద్ధాంతము ననుసరించి ఖగోళములో సూర్యుడు 90 డిగ్రీలపై ఉన్న రోజు (1 ఏప్రియల్) నుండి సంవత్సరారంభముగా నిర్ణయించుకొని 1700 ఎ.డి. వరకు ఆచరించినారు. ఇది మన సిద్ధాంతమునకు అనుకూలముగానే యున్నది.

క్రీ.శ. 1600 ఎ.డి. ప్రాంతములో చార్లెస్ అనే ఫ్రాన్స్ దేశ చక్రవర్తి తమ ఆదికృత ప్రధానముగా ఉండవలయునని భావించి ఖగోళ శాస్త్రజ్ఞుల అభిప్రాయములు సేకరించి నిరయన సూర్య సంచారము ప్రకారము ప్రతి సంవత్సరము సూర్యుడు అదే డిగ్రీలలో ఉండునట్లు మాసములలో (కలువనప్పుడు) హెచ్చు తగ్గులు చేస్తూ రవి "0" డిగ్రీల నుండి ప్రారంభించి చివరి రెండు మాసములైన జనవరి, ఫిబ్రవరులను 1నెల 2నెలగా చేర్చుకొని మార్చి నుండి అదే క్రమములో లెక్కిస్తూ జనవరి 1టిని క్రొత్త సంవత్సరముగా క్రీ.శ. 1752 ఎ.డి. నుండి వాడుకలోనికి తెచ్చెను. దీనిని



క్రమముగా కొన్ని, కొన్ని దేశములు ఆమోదిస్తూ ఆచరణలో పెట్టిరి. తమ పరిపాలనలో గల అన్ని దేశములయందు ఈ పద్ధతి వాడుకలోనికి తేగా ప్రస్తుతం. దీనినే అందరూ వాడుకొనుచున్నారు. ఇంతియే కాని 1 జనవరి నాడు ప్రకృతి పరంగా గాని ఖగోళ పరంగా గాని ఎటువంటి మార్పు జరుగదు.

ఇదే విధంగా రోజు మార్పు కూడా అర్ధరాత్రి 12 గంటలకు మార్చుచున్నారు. ఈ సమయమున పశుపక్ష్యాదులు సమస్త జీవకోటి నిద్రావస్థలో ఉండును. భూమి యందుగానీ అకసమందుగాని, ఖగోళములోగాని ఎటువంటి మార్పు జరుగదు. ఇదయు తమ ఆధిపత్య ప్రదానమునే చూపుచున్నది. దీనికి శాస్త్రీయ ఆధారము సృష్టి ఆరంభమున ప్రభవ సం॥చైత్ర శు॥ ౧ ఆదివారం అర్ధరాత్రి నుండి గ్రహములు మేరువును ఆదారము చేసుకొని చలించుట ప్రారంభించినవి. ఈ గ్రహ గతులననుసరించియే కాల గణన చేయబడుచున్నది.

కాని భూమి యందలి అన్ని ప్రదేశములకును ఈ అర్ధరాత్రి నుండి దిన గణనము వర్తించదు. గ్రీనిచేలో అర్ధరాత్రి గం॥12లకు దినము మారినచో మన దేశమునకు ఉదయము గం॥5-30లకు అనగా అరుణోదయకాలమునుండియే దినారంభమగును. అర్ధరాత్రి 12-00ని. మన. దినారంభ సమయమునకు (ఉ .5-30కి) వారు దినారంభము (అర్ధరాత్రి 12-00) నాచరించును. వారి అర్ధరాత్రి దినారంభ వ్యవహారమును తిరిగి మన దేశమున మనకు వర్తింప జేయవలెననడి అశాస్త్రీయ పద్ధతిని ప్రచారము చేయుట జరిగినది. ఉదయాదుదయం వారం అనునది శాస్త్ర సమ్మతమైన దినారంభము.

పై విషయములన్నియు పరిశోధింపగా తమ ఆధిపత్యము ప్రభావముగా ఆంగ్లేయులు ఈ పద్ధతిని మన దేశమునందు ప్రవేశపెట్టి మన శాస్త్రమునే తప్పుగా చెప్పు చున్నారు.

## ఇంగ్లీషు తేదికి వారము కనుగొనుట

ఈనాడు ప్రపంచమందంతటను వాడబడు క్రీ.స్తుశకము కూడా వారం విశ్లేషణ ప్రకారమే గుణించబడుచున్నది.

1. క్రీస్తుశకం ఎన్నడు ప్రారంభమైనది. కలిగతం 3101 రక్తాక్షినామ సం॥ పుష్య శు ౧౨ ఆదివారం ప్రారంభమైనది. 2. ఇది కూడా 0-0-0 నుండి 1 తేదీ ప్రారంభం ఆదివారం నుండియే ఐనది.

గణితము చేయుటకు సూక్ష్మీకరణవిధానం -

సౌరమాన పద్ధతి ద్వారా తయారుచేయబడిన దీనికి సం॥ 365 రోజులు÷ 7 = 52 వారాలు, ప్రతి సం॥ 1రోజు ఎక్కువారం క్రీ.శక సం॥లలో వందల

స్థానము విడిచి పరులస్థానమును నాల్గుచే భాగించి వచ్చిన లబ్ధము శకంలో కటిపలెను. తదుపరి ఇష్టతేది మా సధృవసంఖ్యను కూడి 7చే భాగింపగా శేషం ఆదివారాదిగా వారమగును.

ఉదా:- 4-5-2015 పదుల సంఖ్యయగు 15ను 4చే భాగిపంపగా లబ్ధం 3 లబ్ధంను 15+3 18యగును తేది 4ను మాసధృవం 1 కలుపగా = 23 ఐనది 7చే భాగింపగా 2 శేషం సోమ వారమగుచున్నది. మాసధవంలు జనవరి7, ఫిబ్రవరి3, మార్చి3, ఏప్రియల్6, మే1, జూన్4, జూలై6, ఆగష్టు2, సెప్టెంబర్5, అక్టోబర్0, నవంబర్3, డిశంబర్5.

## ఇంగ్లీషు తేదికి తిథి కనుగొనుట

క్రీ॥సకాబ్దమును 19చే భాగింపగా శేషములను 11చే గుణించి 30చే భాగింపగా ఆ సం॥ము జనవరి 1 తిథి అగును. జనవరి 1నాటి తిథికి ఇష్ట తేదీని మాస ధృవ సంఖ్యను కలిపి 291/2చే భాగింపగా రాత్రి 12-0ల ఇష్ట తిథి అగును.

మాస ధృవములు : జనవరి 0, ఫిబ్రవరి 1/2, మార్చి 281/2, ఏప్రిల్ 1/2, మే1, జూన్ 2 1/2, జూలై3, ఆగస్టు 41/2, సెప్టెంబర్ 6, అక్టోబర్ 61/2, నవంబర్ 8, డిసెంబర్ 8 1/2.

ఉదా॥ 13-05-2015

2015 ÷ 19 = శేషము 1 × 11 =11   2015 జనవరి 1

13 × 11+1 = 25 మే బ॥ దశమి

## భారతీయ క్యాలెండర్ (చాంద్రమానము)

సృష్ట్యాది 195 కోట్ల 58 లక్షల 85వేల సం॥ నుండి భారతీయ సిద్ధాంతము గణించబడుచున్నది. ఇది రవ్యాది సప్త గ్రహగతుల ఆధారముగా నిర్మించబడినది. దీనిని అమూలాగ్రము తెలుసుకొనవలెనన్న ఒక మహా సముద్రము వంటిది. ప్రస్తుతం కొద్ది వివరణ ఇచ్చు చున్నాను. ఎక్కువ తెలుసుకొనగోరువారు పంచాగకర్తను సంప్రదించగలరు.

చాంద్రమానమునసుసరించి చైత్ర శు॥ రోజు సంవత్సరారంభమగును. అశ్విని నక్షత్రముండును.

చాంద్ర సంవత్సరమునకు 354 రోజులు 8 గం॥ 48ని॥ 35 సెకండ్లు.

చంద్ర భ్రమణమునసుసరించి ప్రతి సం॥ము ఆ మాసమందు ఆ తిథికి ఆ నక్షత్రము వచ్చుచుండను. చంద్ర సూర్య భ్రమణం అంతరమే తిథి.

ఉదా: ప్రతి సం॥ బాద్రపద శు హస్తతో కూడుకొని వినాయక చవితి.



ప్రతి సం॥ ఆశ్వీయుజ శు॥ శ్రవణంతో కూడి విజయదశిమి (దసర)

ప్రతి సం॥ మాఘ బ॥ శ్రవణంతో కూడి మహాశివరాత్రి మొ॥వి

ప్రతి రోజు ఉదయాస్తమయములు జన జీవనములున్నట్లుగానే ప్రతి సంవత్సరం సిద్ధాంత పరమైన పంచాంగముందు తిథి నక్షత్రములు అట్లే యుండును.

దీని విశిష్టతను విదేశీ మేధావులు కనిపెట్టి చాంద్రమాన భారతీయ క్యాలెండర్ మాదిరిగా ఉండునట్లు భారతీయ సౌరమానమునకు సరియగు తేదీలను (రోజులను) గణించి ఈనాడు వాడుకలో గల క్యాలెండరును నిర్మించి ప్రపంచదేశాలు ఆమెదించినవి.

విశేషము : భారతీయ శాస్త్ర విజ్ఞానముచే ఇక్కడి ఋషులు చెప్పిన సిద్ధాంతమును అందరూ ఆమోదించి వాడుకొనుటచే అతి పవిత్రమైన సూర్య సిద్ధాంతము.

విచారణ: ఈనాటి వాడుక క్యాలెండర్ శాస్త్రీయమని అతి పవిత్రమైన ఈ సూర్య సిద్ధాంతమును సృష్టి ఎలా ప్రారంభం ఎప్పుడు అయినది మొదలుకొని సప్త గ్రహముల ఉత్పత్తి క్రమము, వాటి గతులను తెలుపుచూ, వీటి ఆధారముగానే కాల గణనను భగవత్స్వరూపుడగు సూర్య భగవానుడు చెప్పిన అజ్ఞానముతో శాస్త్ర ప్రమాణము కాదని, ప్రపంచ దేశములు భారత ప్రభుత్వము ఒప్పుకొనుచున్న ధృక్ పద్ధతి శాస్త్రీయమని చెప్పుకొను చున్నారు. కనీసం ఆచరణ యోగ్యంగా లేనట్టి తిథి నాలుగు గంటలు క్షయము గల దానిని సూర్య సిద్ధాంతమునకు చెప్పిన గ్రంథములను చూపి నిరాధారముగా తప్పు త్రోవ పట్టించువారు ఈనాడు సిద్ధాంతులని చెప్పుకొనుచున్నారు. హిందూ ధర్మ రక్షణ పీఠాధిపతులెవరునూ ధృక్ సిద్ధాంతము పాటించరు. కావున హిందూ ధర్మము వారు తమ తమ జన్మదినములు, పెండ్లి దినములు, పండుగలు చేసుకొనిన ఆనాటి తిథి నక్షత్రములు సరిగా సరిపోవును.

## క్యాలెండర్ నిర్మాణము (సౌరమానము)

పూర్వకాలమందు క్యాలెండర్ వివిధ దేశములయందు వివిధ రకముగా నుండెను. కాల గణన కొందరు వారమునకు 10 రోజులుగను, మాసమునకు 30 రోజులుగను, ఆగస్టు మొదటినెలగాను వాడుకొనిరి. అది కాలగణనకు సరిపోనందున అన్ని శాస్త్రములు పరిశోధించి భారతీయ ప్రమాణములోని రయన సౌరమానమును) సూర్య సిద్ధాంతమును ప్రమాణముగా పండితులందరు ఒప్పుకొనిరి. ఈ సిద్ధాంతానుసారము సంవత్సరమునకు 365 రోజుల గం॥ల 9ని॥ల 6 సెకం॥ దీనిని నిరయన సూర్య సంచారమునసుసరించి ప్రతి సంవత్సరమునకు తిథి నక్షత్రములవలె

ఆ డిగ్రీలలో సూర్యుడుండునట్లు తేదీలను కలుపుతూ హెచ్చుతగ్గులు వచ్చినపుడు తేదీలను హెచ్చుతగ్గులు కలిసి ఒక ప్రమాణముగా తేదీలు వేసినారు.

సూర్యసంచారం:- '0' డిగ్రీల నుండి 90 డిగ్రీలకు 3 నెలలు దీనిని 1 జనవరి నుండి 31; ఫిబ్రవరి 28, మార్చి 31 = 90 రోజులు

మళ్ళీ సూర్యుడు :- 90 నుండి '0' 91 రోజులు

30 ఏప్రియల్, 31మే, 30జూన్ = 31 రోజులు

సూర్య సంచారం :- '0' నుండి 90 డిగ్రీలకు 92 రోజులు

31 జూలై, 31 ఆగస్టు, 30 సెపెంబర్ = 92 రోజులు

మళ్ళీ సూర్యుడు:- 90 నుండి '0' డిగ్రీలకు 92 రోజులు

31 అక్టోబర్, 30 నవంబర్, 31 డిశంబర్

ఈ విధముగా మొత్తము 365 రోజులు కాగా మిగిలిన 6 గంటల 6 4 24 గం॥ నాల్గు సంవత్సరములకు ఒక రోజు చొప్పున ఫిబ్రవరిలో కలసి 29 రోజులగును. ఇందుకు నిదర్శనం ఆయాతేదీలపై ప్రతిసంవత్సరం సూర్యుడు అదే డిగ్రీలపై ఉండును. మరియు ఆరోజు ఉదయ సమయంలు లగ్నములు అన్ని సంవత్సరాలలో అదే మాదిరిగా యుండును.

ఇది ప్రమాణముగా నుండుటచే పరిపాలనా సౌలభ్యం కురకును, మరియు సంవత్సరముల కాలగణన కొఅకును ఏదో ఒక శకమును వాడుకొన వలయును.

దాదాపు 200 సం॥లు ఆంగ్లేయులు ప్రపంచములో చాలా భూ భాగమును ఈ భారతీయ సౌరమాన సిద్ధాంత క్యాలెండరు వాడుకలోనికి వచ్చినది. '0' డిగ్రీలపై 1 జనవరిని మొదటి నెలగా గణించుచున్నారు.

అందుకు ఉదాహరణగా 14-4 అశ్వినికార్తి మొదలు అన్ని కార్తులు కూడా ప్రతి సంవత్సరము ఒకరోజు భేదముతో వచ్చుచుండును వీటిని పాచ పంచాగములలో కార్తి చక్రము చూచితె తెలియును. ఇదే పద్ధతిలో సూర్యుడు రాశి మార్పు చెందినప్పుడు సంక్రమణమందురు.

సందేహం:- మకర సంక్రాంతి జనవరి 14న వచ్చినప్పుడు మిగతా పండుగలు ఎందుకురావు ?

సమాధానం :- సంక్రాంతి పండుగ సూర్యుని సంచారము అనుసరించి వచ్చునది మేష సంక్రాంతి మొదలు 12రాసులకు అదే తేదీలకు సంక్రమణము వచ్చును. ఇక మిగతా హిందూ పండుగలన్నియు తిథి ప్రమాణముగా ఆచరించుటచేత



ఇంగ్లీషు తేదీలకు వీటికి సంబంధముండదు.

పండుగలు తేదీలకు భేదమును ఆగ్లేయుల క్యాలండరులో ఒక సం॥నకు 365రో=6గం॥ 10ని॥ పంచాంగమునందు 354 రోజులు 48ని॥ 35 సె॥ కావున 365 రోజు - 11 రోజుల భేదముండుటచే ఈ బేదముతో తెలుగు పండుగన్నియు వచ్చును.

| ఉదా : | ఉగాది | దసరా | వినాయక చవితి |
|---|---|---|---|
| ఈశ్వర | 8-4-97-11 | 11-10.97 | 5-9-97 |
| బహుధాన్య | 29.3.98.11 | 1.10.98 | 25.8.68 |
| ప్రమాధి | 18.3.99.11 | 13.10.99 | 6.9.99 |

అదే పద్దతిలో పుట్టినరోజులు, పెండ్లి రోజులు, శ్రాద&ధములు ఏవైనను 11రోజుల భేదముండును.

11 రోజులు తగ్గించిన పండుగలు 4 వారములు కలిపిన వారము కూడా సరిపోవును.

సిద్ధాంత శిరోమణి
బ్రహ్మభట్ల శ్రీరామ సిద్ధాంతి,
పుష్పగిరి మహాసంస్థానం
సిద్దిపేట, ఫోన్ 08457 - 24142

## జగత్సృష్టిలో సప్తగ్రహములు

సత్యజ్ఞానానందరూపమైన పరమాత్మ శుక్ల వర్ణతేజోమూర్తియై ఈ విశ్వమంతయు నిండియున్నాడు. పరబ్రహ్మ నిర్గుణుడైనను "ఉపాస కానాం క్షేమార్థం బ్రహ్మణోరూపకల్పనా సృష్టి చేయతలచినవాడై ఉపాసకులను అనుగ్రహించుటకు రూపముధరించెను. పిదప పంచభూతములను సృష్టించి నీటియందు తనవీర్యమును విడువగా సృష్టిప్రారంభమై నారాయణ రూపముదాల్చెను తన నాభికమలము నుండి రెండవరూపములో బ్రహ్మను సృజించెను భగవత్సంకల్పముతో ఇదేసృష్టి విధానమైనది. పరబ్రహ్మతేజస్సు (వీర్యము) నీటిలో పతి విష్ణురూపమై తన నాభికమలములో బ్రహ్మ పుట్టుటచే ఇప్పటికి పురుషుని వీర్యం తల్లి గర్భమున బడుటకు తల్లి నాభినుండి నాళముతో శిశుగర్భమునకు ఆహారము అందుచున్నది. ఇదినాటినుండినేటి వరకు నడుచుచున్న సృష్టివిధానము..

బ్రహ్మదేవుడు తనకు రూపము ప్రసాదించిన తండ్రియగు నారాయణునికి నమస్కరించి తనకర్తవ్యమేమియని అడిగెను అప్పుడు విష్ణుదేవుడు బ్రహ్మను సృష్టి కర్తగా నియమించి సృష్టిజేయమని ఆజ్ఞాపించెను. ఏదైనా రూపమేర్పడవలెన్ను ఒక ఇంధనం అవసరము దేనితో చేయవలెనని యడుగగా నారాయణుతో పంచభూతములను ఇంధనముగా చేసుకొనుటకు ఆ జ్ఞాపించెను. భూమిరూపముగా (శరీరం) ఆకాశం ప్రాణంగా వాయువు శ్వాసగా అగ్నివేడిగా, నీరు జలమువలె ప్రతి ప్రాణికి యున్నవి. బ్రహ్మ అయువు 100 సం॥ శతమానంభవతి వందసంవత్సరకాలము తెలుసుకొనుటకు రవ్యాది సప్తగ్రహములతో కాలమేర్పరచెను.

సూర్య, చంద్రులుమనచక్షువులుగాను కుజుడు అగ్నిగాను, బుధుడు భూమి గాను, ఆకాశం గురువుగాను నీరు శుక్రునిగాను, వాయువు శనిగాను సృష్టియందు వ్యాపించియున్నందున. ప్రతి ప్రాణులయందు ఇమిడియుండుటచే మానవులయందు జ్యోతిశ్రక్రముండి వాటి ప్రభావముల ననుసరించి ఫలా ఫలములు ఇచ్చుచున్నది ఈ విధంగా జ్యోతిషఫలములుజాతక ఫలములేర్పడుచున్నవి.

### రాహు - కేతువులు

జాతకము శతమానమునకు రవ్యాది సప్తగ్రహదశా వివరణ రవికి6, చంద్రునకు10, కుజునకు7, బుధునకు17, గురువునకు 16, శుక్రునకు20, శనికి19గా యున్నవి. ఇప్పటివరకు రాహుకేతువులు గ్రహములుగా గాని దేనికి అధికారము గాని చెప్పబడలేదు. కాలగణితములో ద్వాదశ రాసులలో రాహుకేతువులకు గృహములు లేవు. అన్ని గ్రహములకు ఋజుగతి వక్రగతి, ఉదయాస్తయములున్నవి. ఏశాస్త్రజ్ఞుడు కూడా రాహుకేతుగణితముచెప్పడు. పంచాంగ గణితమందు పాత (భూమినీత) ను రోజుకు 3-11 చెప్పబడినది. కాని అదిరాహుకేతువు కాదు. వచ్చిన



పాతను జ్యోతి శ్చక్రద్వాదశ రాసులలో తీసివేయగా నిలిచినది రాహువనియు, ఇతనికి 6వ స్థానమున కేతువుండునని వేయుచున్నారు. రాహుకేతువులుగా భూ భ్రమణమనుసరించి వచ్చుచున్ననీడయని తెలియనగును. గ్రహణమందుకూడా పాతతోనే ఇవి ఎవరిననుసరించియుండునో వారిఫలములనిత్తురు వరాహమిరుడు బృహజ్జాతక గ్రంధమందురాహుకేతువులా గ్రహము కావనియే చెప్పబడినది. రాహువు ఒకరాశిలో 18నెలలు సంచరించును. దీనిని బట్టియే ఈయన దశ 18 సం॥గా రాహుకు 7 కేతువుండుటచే 7 సం॥ కేతువుగా నిర్ణయించబడినది.

సిద్ధాంతమందు రాహువును, భూమి నైసర్గికముననుసరించి భూమిపై నీడపడుప్రాంతమును రాహుకాలమని ఇవి ప్రతిరోజు భూభ్రమణమనుసరించివచ్చు ననియు, సూర్యుని నీడ పడినప్పుడేనని అనగా రాత్రి కాలంలో రాహుకాలమందురు. ఆసమయమును ఆప్రాంతమువాళ్లు వర్జింపవలెననియున్నది. ఖగోళమందు గ్రహముల సంచారము ననుసరించి సూర్యకిరణములచే వారమేర్పడునని చెప్పబడినది. ఇవి గ్రహములేయైన రవ్యాది ఏడు గ్రహముల యొక్క వారము లేర్పడినవి. కాని రాహుకేతువులు ఖగోళమందు గ్రహములుకావు కనుక వాటికి వారములేదు. సూర్యకిరణముసోకిన వెనకభాగముగల నీడ సూర్యుడుముందుకునడుస్తుండగా నీడ వెనుక కగుటచే ఈ ఛాయ గ్రహములనడక ఎప్పటికి వక్రగతియే యుండును.

ఈనీడ శని, శుక్ర, గురు, బుధ, మంగ, ఆది, సోమవారములలో అని వక్రగతిలోనె చెప్పబడుచున్నది. ముహూర్త చక్రములో ఛాయాగ్రహమనియే యున్నదికాని ఫలానాస్థానమందు ఉండకూడదని అపవాదములేదు. ప్రధానకార్యములు, వివాహము, దేవాలయ కట్టుట, ప్రతిష్ఠా, ఉపనయనాదులకు ఎక్కడ ఉన్న దోషంలేదని పూర్వకాలమృతమందు చెప్పబడినది 86వ పేజీ 102,శ్లో॥ స్వల్పదోషములు, అంగవంగ, కళింగ, అవంతీ, మగధ, కాశ్మీర, ద్రావిడ, సాల్వ, కురు, మ్లేచ్ఛ బాహిక దేశమందు పనికిరావనియు, మిగితా స్థలములలో విచారింప పనిలేదని చెప్పబడినది.

శ్లో ॥ వివాహేషుచ దేవానాం ప్రతిష్ఠాసూపనయనే॥ ఛాయగ్రహే తువిజ్ఞేయా రాహుకేతూనదోషదా ॥

ఇలా ఎక్కడ గూడా వీరిప్రశంసలేనప్పుడు, కాల సర్పదోషమని, మృత్యుయోగమని వాడుకలో యున్నది. రాహువు ముఖము మాత్రము మనుష్యుని దైమిగ తాశరీర భాగము సర్పరూపమగుటచే ఈ దోషమునకు సర్ప శాంతివిధానము వ్రాయబడును.

| | | | |
|---|---|---|---|
| శ | కు | కే | |
| ల | కాలసర్ప దోషము | | |
| ర.బు. చం. | | | |
| గు.శు | రా | | |

## విజ్ఞానంబ్రహ్మేతివ్యజనాత్

**ఇది కాల సర్పయోగం**
**జ్యోతిషామృతం పేజి.78**

కాలసర్పదోషమనగా రాహుకేతువుల మధ్యలో ఒకభాగములోర వ్యాదిసప్తగ్రహములుండుటయే దోషములు, అల్పాయుర్ధాయము, దరిద్రము, మానసికవ్యథలు, హృద్రోగము, వివాహాటంకము, ఆలస్యంగా సంతానముకల్గుట. విద్యాభంగము, యోగభంగము, జాతకము నందు శుభగ్రహములు కేంద్ర మందుగాని, ఉచ్చలోగాని యున్నను లేదా రాహు కేతువులతో ఏగ్రహము కలసియున్నను, పైదోషము లుండవు.

ఈ రాహుకేతువులు ఛాయాగ్రహములు వీటికి స్వయం ప్రతిపత్తి ఎక్కడాలేదు పన్నెండు రాసులలో ఎందులో ఇల్లులేదు. రవ్యాది సప్త గ్రహములకు కాలచక్రంలో గలసవ్యగతి, వక్రగతి, ఉదయాస్తమయములులేవు. వీరికి పాతగణితమును 12రాసులలో తీసివేసిన రాహును దీనితో 6 కలిపిన కేతువగును.రోజుకు 3.11 ఘడి విఘడియలు నిర్ణయించబడినవి. రవ్యాదిసప్త గ్రహములకుగలహోరాయందు, వారోత్పత్తి లోకూడా ఎటువంటి స్థానములేనట్టి ఛాయాగ్రహములు స్వయంగా ఎటువంటి ఫలితములీయజాలవు. ఎవరినిఅనుసరించియుండునో వారిఫలితములిచ్చుదురు. మానవుని ఆయుర్దాయం 100సం॥లో రాహు, కేతుదశలు లేకుండానే నిండుచున్నవి. దైవభక్తి యందు ప్రజలవిశ్వాసమును ఆధారంచేసుకొని కాలసర్ప దోషంను ఒక పెను భూతముగా చూపి భయభ్రాంతులను చేయుచున్న దానిని అర్థం చేసుకొని వాటివల్ల జరుగు కీడునుసశాస్త్రీయముగా శాంతి హోమాదులు నిర్వహించి సమస్త సుఖములు పొందవచ్చును. దీని శాంతి, జప, హోమ పూజా విధానము, ప్రతిష్టా మౌక్తి క మను గ్రంధమునుండి వేదమందు సర్పసూక్తం నుండి సేకరించి, శాంతియొక్క విధి, విధానములు వ్రాయుచున్నాను.

విధానము: ఆశ్లేషా నక్షత్ర దినే. తథాచ కృష్ణ చతుర్ధ శ్యమావేస్య, అథవా పంచమ్యాది శుభ దివసేకార్యం, 'ఆశ్లేషా నక్షత్రము రోజునకానీ, లేదా ఏదైనా ఒక శుభదివస మందు చేయవలెను. వస్తువులు 8, కంచుళ్ళు, 8, వెండిగాని, బంగారివిగాని సర్పరూప మూర్తులు, వస్త్రం, బియ్యం, ప్రధాన కలశం, పూజా సామాగ్రి, హోమ ద్రవ్యాలు, ఇత్యాదులు'



పూజావిధి, అచమ్య॥శుభతిథౌ॥యాజమానస్య..గోత్రస్య...నామ ధేయస్య. మమపూర్వజన్మ కృతేన సర్పవధ దోషేన ఇహ జన్మని అనపత్యాది, దు:ఖ, దారిద్ర్య, దౌర్భాగ్యాది, సకల దోషపరిహారార్థం, జన్మలగ్నవశాత్‌రాహు, కేత్వంతరాళస్థితి సకలగ్రహస్థితి జన్మస్థాన బలిత్వశుభ దృష్టినిరీక్షితత్వాదిసమస్త సుఖాభావనివృత్తి పూర్వకం దీర్ఘాయు, రారోగ్యైశ్వర్య, వంశాభివృద్ధి, సుఖ, సౌభాగ్య, ప్రాప్తయేశ్రీశేష రాజప్రీత్యర్థం, సగ్రహమఖాంకాలసర్పయోగ జననశాంతింకరిష్యే॥

కలశ గణాధిపతి కర్మణ పుణ్యాహవాచనం, తండులాష్టఅష్టదళ పద్మంసర్వతోభద్ర, ప్రధాన కలశం పూజా ప్రాగాది దళేషు అష్ట దళే మృణ్మయ పాత్రేసర్ప ప్రతిమాన్‌పృథక్ మంత్రేణ స్థాపనం కారయిష్యే ॥ మృణ్మయ పాత్రాణి క్షీరేణ పూ రయిత్వా ప్రాగ్భాగే

1.ఓంఇదగ్ంసర్వే భ్యో హవిరస్తు జుష్టమ్। ఆశ్రేషాయేషామనుయంతి చేత యేఅంతరిక్షం పృథివీం క్షియంతి। తేవ సర్పాసోహవమాగమిష్మా॥ యేరోచనేసూర్య స్యాపిసర్పా।యేదివం దేవీ మను సంచరంతి యేషామాశ్రేషామనుయంతికామం। తేభ్యసర్పే భ్యోమధుమజ్జుహోమి॥ ఓంభూ అనంతమావాహయామి॥ ఓంభువః ఓంగుసువః ఓం భూర్భువస్సువః । అనంతమావాహయామి

2. అగ్నేయే, ఓం నమోఅస్తు సర్పేభ్యో యేకేచ పృథివీమనుయే అంతరిక్షే యేదివి తేభ్య సర్పేభ్యోనమ॥ ఓంభూ వాసుకీమావాహయామి॥

3. దక్షిణే, ఓం యాఇషవో యాతు ధానానాం యేవా వనస్పతీగ్ంరను । యేనా వటేషు శేరతె తేభ్య సర్పేభ్యోనమః॥ ఓంభూఃతక్షక మావాహయామి॥

4. నైఋ ఋత్యాం। ఓం యశస్కరం బలవన్తం ప్రభుత్వస్తమేవ రాజాధిపతిర్భభూవ। సంకీర్ణనాగాశ్వ పతిర్నరాణాం సుమంగల్యం సతతందీర్ఘమాయుః॥ ఓం భూః మహాపద్మ మావాహయమి॥

5. పశ్చిమే ఓం॥ కర్కోటకో నామసర్పోయే దృష్టి విష ఉత్యతే।తస్య సర్పస్య సర్పత్వంతస్మై సర్ప నమోస్తుతే। ఓంభూఃరకర్కోటకమావాహయామి॥

6. వాయవ్యే। ఓంయేవామీ రోచనేదివో। యేవాసూర్యస్యరశ్మిషు। యేషామప్సు సదస్కృతం।తేభ్యసర్పేభ్యోనమః॥ ఓం భూఃతక్షక మావాహయామి॥

7. ఉత్తరే॥ విప్రవర్ణం శ్వేతవర్ణం। సహస్ర ఫణసంయుతం। సంపూజయామ్యహందేవం। శేషంవై విశ్వ రూపిణీ॥ఓంభూః శంకపాల మావాహమామి॥

8. ఈశాన్యే॥ఓంఅజగరో నామసర్ప సర్పి రవిమషోహాన్। తస్మిన్ని సర్పసుధి తస్తేవత్వాస్పాపయామసి॥ ఓంభూః అజగర మావాహయామి॥ ఓం తత్పురుషాయ

విద్మహే కద్రువంశాయ దీమహితన్నఃసర్వం ప్రచోదయాత్॥ ఓం భుజంగమాయవిద్మహేచక్షు శ్రోత్రోయధీమహి। తన్నస్సర్పః ప్రచోదయాత్॥ పృథివ్యాంతరిక్ష దివిసర్పే భ్యోన్నమః॥ఇత్యభిమంత్ర్యా॥ అవాహనార్చనపురుషసూక్తేన. సర్ప సూక్తేన అభిశేచనం కుర్యాత్॥ అగ్నిప్రతిష్టాదికం మూలమంత్రేణప్రత్యేకం 108 అహుర్జుహుయాత్॥ ప్రార్థన జకత్కారో జరత్కార్యో ఆస్తికఃపన్నమేవచ। ఆస్తికస్సత్య సంధూమాంపన్నగేభ్యోహిరక్షతు॥ పన్నదేహోహిరక్షత్యోంనమ ఇతి॥ ఉద్వాసనానంతరం సర్పప్రతిమలు 1. ఆచార్యునికి 2. పురోహితునికి, 3. పుట్టయందు 4. విష్ణుఆలయం 5. శివాలయం 6. చెర్వునందు 7. బ్రాహ్మణులకు దానమీయవలెను. రుద్రాభిషేకం పుట్టపూజచేసి గోమేధకం ధరించవలెను. సమస్తదోషములు తొలగిపోవును.

## గ్రహములకు రాసుల ఆధిపత్యము వచ్చిన వివరములు

ఖగోళ చక్రము 12 భాగములుగా చేసి రాసులుగా ఏర్పరచిరి. నవగ్రహములలో రవి,చంద్రుడు, బింబ గ్రహములు, కుజాది పంచ గ్రహములు, తారా గ్రహములు, రాహు, కేతువులు, ఛాయా గ్రహములుగా నున్నవి. బింబ గ్రహములగు రవి, చంద్రులు ద్వాదశ రాశులను సింహ షట్కము, కుంభ షట్కముగానేర్పరచుకొని రవి సింహమునకు అధిపతియై కన్య, తుల, వృశ్చిక, ధనుర్మకరములను తన ఆధీనమందుచుకొనగా, చంద్రుడు కర్కాటకమునకు అధిపతియై మిథున, వృషభం, మేష, మీన, కుంభములను స్వాధీనము చేసుకొనెను.

సింహ షట్క మహర్పతే కుంభ షట్కం నిశాపతే, బుధ, భృగు, కుజ, జీవ, శనైశ్చరా ప్రార్థయంత స్వభావనౌక్రమశః

గ్రహముల మధ్య గతులు

| | |
|---|---|
| రవి | ౫౯-౮ |
| చంద్ర | ౭౯౦-౩౫ |
| కుజ | ౩౧ - ౨౬ |
| బుధ | ౧౮౬- ౨౪ |
| గురు | ౫ - ౦ |
| శుక్ర | ౩౬ - ౫౯ |
| శని | ౦ - ౨ |
| రా.కే. | ౦ - ౩ |




రవి నుండి దూరము ననుసరించి గ్రహగతులు చూపబడును.



## గ్రహముల గృహ ప్రాప్తి వివరములు

ముందుగా బుధుడు రవి దగ్గరకు వచ్చి గృహదానము కోరగా, రవి తన ముందుగల కన్యను ఇచ్చెను. తర్వాత చంద్రుని వద్ద వేడగా తన వెనుక గల మిథునము ఇచ్చెను, బుధునకు కన్యా, మిథునములు రెండు గృహములు ఏర్పడుటచే తన దినగతిననుసరించి రవికి, ఒకరాశి వెనుక, ముందుగానీ సమముగాగాని ఖగోళమందు సంచరించుచుండుటచే ఈ బుధ గ్రహము మనకు దృగ్గోచరము కాదు.

తదుపరి శుక్రుడు వచ్చి రవి, చంద్రులను గృహదానం కోరగా రవి బుధుని ముందున్న తులను, చంద్రుడు బుధిన వెన్క గల వృషభములను ఇచ్చిరి. ఈ కారణమున శుక్రుడు రవికి రెండు రాసుల వెన్క ముందు ఖగోళమున చరించుచుండును.

తర్వాత కుజుడు ఇరువురిని గృహదానము కోరగా శుక్రుని తులా ముందు భాగమగు వృశ్చికమును రవియు, వెన్క భాగమందు మేషమును ఇచ్చిరి. కావున కుజ గ్రహం నాల్గు రాసుల వెన్క, ముందు చరించును.

అలాగే గురువు వచ్చి రవి, చంద్రులను కోరగా రవి కుజుని ముందుగల ధనస్సును, చంద్రుడు కుజుని వెన్కగల మీనమును ఇచ్చెను. కావున గురువు రవికి ఐదు రాసుల వెన్క, ముందు సంచరించును.

చివర శనైశ్చరుడు వచ్చి గృహదానము కోరగా గురుని ముందు గల మకరమును రవియు, వెన్కగల కుంభంను చంద్రుడు ఇవ్వగా శని వరుసగా మకర, కుంభముల ఆదిపత్యము వచ్చెను. దీనిని అనుసరించి శని రవికి ఆరు రాసుల వెన్కగానీ, ముందుగాని చరించును.

ఈ వృత్తాంతము విని ఛాయా గ్రహములగు రాహు కేతువులు వచ్చి బ్రతిమాలగా, తమకు గల గృహములన్నియు ఇచ్చి మేము చెరియొకటి మాత్రమే ఉంచు కున్నట్లు చెప్పిరి. ఐనను పట్టువీడక బ్రతిమిలాడుటచే రవి తన రాసినే రాహువును వాడుకోమనగా, చంద్రుడు కార్కటకము కేతువును వాడు కొమ్మనెను. పొరుగువాడైన బుధుడు కన్యను, శుక్రుడు వృషభమును, గురువు మీనములలో శుభ ప్రదాతయగుచున్నాడు. కానీ శని మాత్రము తన గృహములయందు ఇంచుక ఐనను తానివ్వలేదు. అందుచేత రాహువు మకర, కుంభ రాసులలో నుండునప్పుడు స్వతంత్ర శుభమునివ్వలేదు. కేతువు సహజంగా ఏడవ రాశిలో యుంచుటచే తత్ఫలం రాహువును కన్య, కేతువును మీనంబు స్వక్షేత్రములైనవి.

## వర్జ్యము - రాహు కాలము

రాహు కాలమనగా నేమి ? సౌరమాన పద్దతిలో మేషాదిమానం, రాహుకాలమనగా సూర్యరస్మి (రాహు) మీద సోకినపుడు దాని చాయ (మనిషి నీడ భూమిపై బడునట్లుగా) భౌగోళిక ప్రమాణము ననుసరించి ఈ నీడ వారసులననుసరించి శ్రీశైలమునకు దక్షిణ దేశములయందు భూమిపై పడుటచే దీని దోషని. ఈ ప్రాంతములకు వర్తించును. కాన ఇట్టి సమయములయందు శుభకార్యములు చేయుట నిషిద్దములు.

దిన ప్రమాణముననుసరించి ఈ రాహుకాలము హెచ్చు తగ్గులగుచుండును. దీని ప్రమాణము అహస్సులో 8వ భాగము. రోజు లోపల 16వ భాగము. దీని ప్రకారంగా ప్రతి రోజు రాహుకాలముండును. నిడివి మొదటి రెండు భాగములు విడిచి క్రమముగా శని, శుక్ర, బుధ, గురు, మంగళ, ఆది, సోమవార ములగును. ఉదా: ఆహో: ప్రమాణము 30 ఘడియలకు వచ్చును. 21-3 తేదీ, 25-12 తేదీన ఆహో: ప్రమాణము ౨౭-౨౦వున్నప్పుడు. ఘ. ౬-౫౦ విఘ వచ్చును. 23-6 తేదీన ఆహో: ప్రమాణము ౩౨-౪౪వున్నప్పుడు ఘ.౮-౧౦ విఘ వచ్చును. కావున ప్రతి దినము ఒకే సమయమునకు రాహుకాలము వుండదు. ఆహో ప్రమాణముల హెచ్చుతగ్గులు వచ్చినప్పుడు రాహుకాల సమయము కూడా హెచ్చు తగ్గులగును.

ఉదా: ౮ | ౩౦-౦ | ౩-౪౫

| | |
|---|---|
| ౨౪ | 6-0 |
| ౬-౦ | 3-0 |
| ౩౨ / ౪౦ | 9-0 శని |
| ౪౦ / ౦ | 1-30 |
| | 10-30 శుక్ర |
| ౩-౪౫ | 1-30 |
| ౩-౪౫ | 12-0 బుధ |
| ౭-౩౦ శని | 1-30 |
| ౩-౪౫ | 1-30 |
| ౧౧-౧౫ శుక్ర | 3-00 మంగ |
| ౩-౪౫ | 1-30 |
| ౧౫-౦ బుధ | 4-30 ఆది |
| ౩-౪౫ | 1-30 |
| ౨౨-౩౦ మంగ | 6-00 |
| ౩-౪౫ | 1-30 |
| ౨౬-౧౫ ఆది | 7-30 సోమ |
| ౩-౪౫ | |
| ౩౦-౦౦ | |

యీ ప్రకారముగా ఉన్నటువంటి గణితమును మాత్రమే చూపిస్తున్నారు శాస్త్రజ్ఞులు.

## వర్జ్యమనగా నేమి ?

చాంద్రమాన పద్ధతిలో వర్జ్యంను ఆచరించవలయును. శ్రీశైల వింధ్యా మధ్య దేశస్తులకు వర్జ్యం ఆచరణీయము. పూర్ణిమనాటి చంద్రుడుండు నక్షత్రమును మాసనామములుగా యేర్పడినవి. చంద్రుడు వచ్చినప్పటి నుండి 60 ఘడియలలో నక్షత్రము రజస్వలాయగును. అది ఆయా నక్షత్రములను బట్టి ఆయా సమయములలో అగుచుండును. ఇట్టి సమయములు సమస్త శుభకార్యములు వర్జ్యనీయములు. నక్షత్రాద్యంత సమయములో 15వ భాగం వర్జ్య ప్రమాణం ఈ దోషము ఇంద్రుడు జర్పిన బ్రహ్మహత్యా దోష నివారణ కొరకు (ఆయన ఇంద్రుని ప్రార్థన మేరకు నక్షత్రంబు పావు భాగము స్త్రీలు 1/4భాగము వృక్షములు 1/4 భాగము తీసుకోబడినవి. స్త్రీలకు 4రోజులు. ప్రకృతి అనగా ఆషాడాది కార్తీక పర్యంతము నాల్గు మాసములు, చాతుర్మాస్యములనియు నాల్గు ఘడియలు నక్షత్రములగును. అస్పృశ్యత పాటించి శుభకార్యములు వర్జ్యనీయములు.



## పండుగలు వివిధరకములు కారణంలు

ప్రశ్నలు :- 1) క్రైస్తవ మతంలో పండుగలన్నియు ఒకే విధముగావచ్చును. క్రిష్టమస్, గుడ్‌ఫ్రైడే మొదలగునవి.

2) మహ్మదీయములో వారి పద్ధతిలోవచ్చును రంజాన్, బక్రీదు మొదలగునవి.

3) హిందూమతమందు వివిధ పంగడలు వివిధరకములుగా వచ్చును.

కారణం వివరములు ఎవరి వారి మత శాస్త్ర మతానుసారముననుసరించి భేదములతోనేవచ్చును. 2013 డిశంబర్ 25 బుధవారం వచ్చిన 2014లో ఒక రోజు భేదము గురువారంవచ్చును. అలాగే శుభ శుక్రవారం మార్చి 23నుండి ఏప్రియల్ 25వరకు ఏ శుక్రవారమైనా రావచ్చును. ఇది మార్చి 21 తర్వాత వచ్చు పౌర్ణమి తదుపరి శుక్రవారం గుడ్‌ఫ్రైడే యగును.

2) వివరణ తెలుసుకుందాము. మహ్మదీయులకు సంవత్సరమునకు 354 రోజులే యుండును. ఇది మనము వాడుకొను భారతీయ చాంద్రమాన సిద్ధాంతమే. శుద్ధపాడ్యమీ నుండి నెల మొదలగును. ఇందులో 50 వారంలు ఆతర్వాత 4రోజులు వచ్చుటచే ఇప్పటి రంజాన్ వారంలో 4 రోజులు కలిపిన వచ్చే సం॥ర రంజాన్ అగును ఇలాగే అన్ని పండుగలు లీపు సం॥రం తప్ప ఎప్పుడువచ్చును. లీపు సంవత్సరంలో 6 కలిపిన వారంవచ్చును.

3) హిందువుల పండుగలన్న చాంద్రమానప్రకారము సూర్య చంద్రుల గమనము ననుసరించి వచ్చుచుండును. ఇవి గూడా ప్రతి సంవత్సరము ఒకే విధంగానే వచ్చును. ఎట్లనగా ప్రతిసం॥ భాద్రపద శు॥౪ వినాయకచవితీ శు॥౪హస్తా నక్షత్రంగల మధ్యాన్నకాలములో నున్నపుడే యగునుఆశ్వయుజశు॥౧౦ దసరా శ్రవణా నక్షత్రముతో గూడిన దశమీ అవరాహ్ణా వ్యాప్తి ఉన్నపుడు అగును. ఇలాగే ఏసం॥రములో నైనా యుండును ఇతర విధానంతో చూచినప్పుడే భేదమగును.

## జన్మనామోత్పత్తి దైవజ్ఞకర్ణామృతం

అశ్వినీనక్షత్రము మొదలా?కృత్తికానక్షత్రము మొదలా ?

సృష్టి ప్రారంభసమయము చైత్ర శు॥పాడ్యమీ, ఆదివారం అశ్విని నక్షత్రం, విష్కంభనామ యోగం. కిమసుగ్నకరణముతో ప్రారంభమైనది. చక్రమును రాసులుగా విభజించునపుడు అశ్వినీనుండి మేషరాశితో చేయబడినది తురగ ముఖాశ్వినీ గుణా ఇది గుల్మము ముఖంలా ఆరు నక్షత్రములుగలదిగా దక్షిణ ఉత్తర మధ్యయందు

యుండును. గడియారం రాక ముందు ఈనక్షత్రములగుర్తించి సమయమును తెలుసుకొనువారు. అందుచే అశ్వినీ గుఘ్టము (యోని) వర్గుగా నిఘంటువులలో చెప్పబడినది. ఇక్కడి నుండియే కాలచక్రము నిర్మాణం జరిగినందున జ్యోతిశాస్త్రమందు మొదటిదైనది.

మొదటమనుష్యులకు వారి రూపముగుణములు. జన్మవిధములనుసరించి, వచ్చేవి. ఉదా. కృప ద్వైపాయనుడు (నల్లని యమునయందు ఒకగట్టుపై చీకట్లో పుట్టుటచే) శివుడు శుభముల నిచ్చువాడు. విష్ణువు అంతటా వ్యాపించినవాడు. ఉత్పత్తితో తెలుసుకోగలరు, ఇవి భు చక్రములోనికి ఎలా వచ్చినవి? నృత్తావ సానే నటరాజ రాజ (లగు సిద్ధాంత కౌమిది) ఒకనాటి సమయములో పరమశివుడు పార్వతీదేవిసమేతుడై ఆనందభరితులై శివతాండవ నృత్యము చేయుచుండగా శివసంకల్పముతో శివుని కాలి అందె తెగిఒక్కొక్కముక్క వేర్వేరుశబ్దములతో (అ.మ్మ.న.గ) నాల్గు ముక్కలైనది. ఇది ఆవకహాథ చక్రంగా శివాజ్ఞచే జ్యోతతిశ్చక్ర మందు కృత్తికాదిగా నిలిచినవి. 1. ఆ.వ.క.హా.డ, 2. మ,ట,ప,ర,త,3. ని,య,బ,జ,ఖ. 4.గ,స,డ,చ,ల, ప్రతి అక్షరము 5. వా.వీవూ,వే,వో గుణితముతోపూర్తియగును. ప్రతి భాగములో 25 అక్షరంలచొప్పున 4 భాగములు కలసి 100 ఐనవి. ఒక్కొక్క చక్రమందు మూడు ఒత్తు అక్షరముల చొప్పున కలుపగా 112 ఐనవి. అభిజన్నక్షత్రం యొక్క ఖీ.ఖూ,ఖే,ఖో, అంతర్నీనమగుటచే 4 పోగా 108 మిగిలినవి. ఒత్తు అక్షరములను ప్రతి చక్రములో 13 అక్షరముల తర్వాత చేర్చగా, అ చక్రమందు దూ, తదుపరి శం,ఝ,థ,ను చేర్చి ద్వాదశ రాసులుగా కూర్చబడినవి. ఆవక చక్రముల కంటే ముందు అశ్వినీ 3. మఖ 4. అని వాడ బడు చుండెను. ఇప్పటికి కొన్ని ప్రాంతముతయందుఇట్లనే వాడుచున్నారు.

### చక్రముల వివరములు

| 1. అ.ప.క.హా,డ | 2. మ.ట.ప.ర.త | 3. న.య,బ,జ,ఖ | 4.గ,స,ద,చ,ల |
|---|---|---|---|
| ఆ,వా,కా,హా,రా | మా,టా,పా,రా,తా | నా,యా,బా,జా,ఖా | గా,సా,దా,చా,లా |
| ఈ,వీ,కీ,హీ,డీ, | మీ,టీ,పి,రీ,తీ | నీ,యీ,బీ,జీ,ఖీ, | గి,సీ,దీ,చీ,లీ, |
| ఊ,వూ,కు,హు డు | ము,టు,పు,రు,తు | ను,యు,బు,జు,ఖు | గు,సు,దు,చు,లు |
| ఏ,వే,జే,హే,డే | మే,టే,పే,రే,తే | నే,యే,బే,జే,ఖే | గే,సే,దే,చే,లే |
| ఒ,వో,హో,డో | మో,టో,పో,రోతో | నో,యో,బో,జో,ఖో | గో,సో,దో,చో,లో |



## గోదావరి పుష్కర వివరములు

పుష్కరం పోషయంతీతి పుష్కరం. బడలిన వారిని పోషించునది (జలం చల్లిన బడలిక పోవును) జలం జన్మనిచ్చునది, లం - లయం చేయునది. సమస్త ప్రాణులు సమస్త సృష్టి నీటియందే పూర్తిగా జీర్ణించును. పాపములును, మలినములను శుభ్రపరచి సుఖ, సంతోషములిచ్చునది.

పూర్వము తుందిబలుడు అనే మహర్షి ఈ జగత్తునకు సకల పాపముల నుండి పవిత్రము చేయవలెనని సంకల్పముతో చాలా కాలం అఖండ తపస్సుచె భగవత్ సాక్షాత్కారమును పొంది. మూడున్నర కోట్ల తీర్థములకు అధిపతియై పుష్కరుడనే పేరు పొందెను. వామనావతారము సృష్టి నిండా నిండినపుడు బ్రహ్మదేవుడు ఈ జలముతో కాళ్లు కడిగి తన కమండలములో నింపుకొనెను. అన్ని నదులు ఈ కమండల జలమునుండే పుట్టినవి.

తదుపరి కాలంలో బృహస్పతి బ్రహ్మను గూర్చి ఘోర తపస్సు చేయగా బ్రహ్మ దేవుడు ప్రత్యక్షమై ఏమికావాలో కోరుకొమ్మనెను. అపుడు బృహస్పతి బ్రహ్మదేవుని కమండలములోని పుష్కమని తనకిమ్మని ప్రార్ధించగా....బ్రహ్మ తథాస్తు అనెను. కాని పుష్కరుడు బ్రహ్మను విడిచి పోవుటకు నిరాకరించెను. బ్రహ్మదేవుని వరము వృధా కాకుండుటకై బృహస్పతి రాశి మారిన రోజునుండి 12 రోజులు గురువుతోనుండుటకు మరియు ఆ సంవత్సరమంతయు ప్రతిరోజు మధ్యాహ్నం 4 ఘుడియలు గురువుతోను ఉండుటకు అంగీకరించెను. కావున గురువు రాశి మారిన వుడల్లా పుష్కరుడు గురువు అధీనములో నుండి ఆ నదికి ముప్పది ఐదుకోట్ల నదుల పుణ్యమునిచ్చును. వెళ్ళిపోవుటకు ముందు కూడ అంత్య పుష్కరాలుగా పిలువబడతాయి. ఇవి పుష్కర ఫలాన్ని యిస్తాయి. సంవత్సరమున ఒక రాశి చొప్పున 12 రాశులకు పుష్కరాలు వచ్చును. వచ్చిన నదికి మళ్ళీ తిరిగి 12 సం॥లకు పుష్కరవచ్చును.

## గురు సంచారము ప్రకారం ఏనదికి ఏ పుష్కర

1.మేషరాశి - గంగానది, 2. వృషభం - నర్మదానది, 3. మిధునం - సరస్వతీనది 4. కర్కాటకం - యమునానది, 5. సింహం - గోదావరినది, 6. కన్యా - కృష్ణానది, 7. తుల - కావేరీనది, 8. వృశ్చికం - భీమరథీనది, 9. ధనస్సు - తామ్రపర్ణినది, 10. మకరం - తుంగ భద్రనదీ, 11. కుంభం - సింధూనది, 12. మీనం - ప్రణీతానది, ఈ పుష్కరాల యందు 12. రోజుల పాటు వివిధ దానాలు, పితృకార్యములు, స్నానాలు చేసిన అనేక పుణ్యఫలము.

ఈ ప్రపంచంలో ఎన్నో నదులున్నప్పటికి భారతదేశంలో ఉన్న నదులకే పుష్కరాలు వచ్చును. ఏలయన ధర్మ, కర్మలను పుణ్యభూమి, భరత వర్షము, ఈ భరత ఖండము, అన్ని అవతారములు, అన్ని పురాణములు ఈ ప్రదేశములలో మాత్రమే చెప్పబడినవి. ఈ కర్మలు అక్కడ తప్ప ఇతరచోట్ల నిషిద్ధమని శాస్త్రము శాసించుచున్నది. హిందూ ధర్మ కర్మలుగాని భోజన, సంభోగ విషయములలో ధర్మశాస్త్రమునకు వ్యతిరేకంగా పశుతుల్య జీవనము గడుపుదురు. కల్లుకుండలో అమృతము వేసినట్లుగా ఉండునట్లుగా మన శాస్త్రములు నిషేధించినది.

### ఏ నది పుష్కరములోనైనను ఇవ్వదగిన రోజువారి దానాలు

| రోజు | దానము | ఫలము |
|---|---|---|
| మొదటిరోజు | భూ,సువర్ణ,ధాన్యము,వెండి | రాజ్యము, అధికారం, ధనలాభం, పాపనాశం, సుఖం |
| రెండవరోజు | వస్త్రం,ఉప్పు,గోవు,రత్నం | గ్రహశాంతి, సర్వభోగప్రదము, ఆరోగ్యము, ఇంటియందు సుఖం |
| మూడవరోజు | బెల్లం,కూరలు,గుఱ్ఱం | సౌఖ్యము,ఇంద్రభోగ్యం,ఆరోగ్యం అధికారం |
| నాల్గవరోజు | నెయ్యి,నువ్వులు,తేనె,పాలు, వెన్న | నరసబాధా నివారణ, ఆయుశ్శు, వైకుంఠ ప్రాప్తి |
| ఐదవరోజు | ధాన్యం,దున్నపోతు,ఎద్దు, నాగలి | సంపద, అపమృత్యునివారణ, కైలాసప్రాప్తి |
| ఆరవరోజు | కర్పూరం-హరిచందనం కస్తూరి | లక్ష్మీప్రాప్తి, భాగ్యము ఆరోగ్యము, సంతోషము |
| ఏడవరోజు | ఇల్లు,చాప,మంచము,పల్లకి | సిరిసంపదలు, అధికారం,సుఖం-భోగం |
| ఎనమిదవరోజు | గంధపుచెక్క,పూలు,అల్లం | ఇంద్రభోగము, గౌరవం, రోగవిముక్తి |
| తొమ్మిదవరోజు | కన్యా, పరుపు,దిండు, దాసదాసీ, అన్నశ్రాద్ధం | గౌరవం,పుణ్యం,దాంపత్యసుఖం |
| పదవరోజు | శివకేవశమూర్తులు, దుర్గా, లక్ష్మీ సాలగ్రామ మూర్తులు, పూజపుస్తకాలు | దైవానుగ్రహము, అరిష్టములు తొలగును. |



| | | |
|---|---|---|
| పదకొండవ రోజు | గొంగడి, పుస్తకదానం (దీపం), రగ్గు | అపమృత్యు నివారణ, జ్ఞానవృద్ధి |
| పన్నెండవ రోజు | దశదానములు, షోడష దానములు | ఇష్టప్రాప్తి, దైవానుగ్రహము |

## గోదావరి నది మహా పుష్కర నిర్ణయము

శ్రీ మన్మథనామ సం॥ అధిక ఆషాఢ బ॥ త్రయోదశి మంగళవారం తేది 14.7.2015 నుండి నిజ ఆషాఢ శుద్ధ నవమి శనివారం తేది 25.7.2015 వరకు సార్ధత్రికోటి సహిత గోదావరి పుష్కరములు ప్రారంభమగును.

గురువు సింహరాశిలోకి ప్రవేశించగానే గోదావరి పుష్కరాలు ప్రారంభమగును. ఈ నదీ పుష్కరాలకు ఏ నదికి లేని విశేషములున్నవి. శుభకార్యములు చేయుటకు పుష్కరాలతో నిషిద్ధము. ప్రాంతీయ భేదముననుసరించి గ్రహ భేదముల ప్రకారం చేయుటకు చెప్పబడినది. గోదావరి మహారాష్ట్రనాసిక్ దగ్గర త్రయంబకంలో అరేబియా సముద్రమునకు 80 కి.మీ. జన్మించినది. ఈ నది మహారాష్ట్రలోని త్రయంబకేశ్వర్, నాసిక్, కోపర్గాన్, పైథాన్ - నాందేడు ద్వారా తెలంగాణ రాష్ట్రంలోకి ప్రవేశిస్తుంది.

**తెలంగాణ:** నిజాంబాదు జిల్లా రేంజల్ మండలం కందకుర్తి వద్ద తెలంగాణలోనికి గోదావరి ప్రవేశించును. తెలంగాణ రాష్ట్రం బాసర నుండి ధర్మపురి, కోటిలింగాల (మంచిర్యాల) గోదావరిఖని, మంథిని, కాళేశ్వరం, చెన్నూరు, భద్రాచలం మొదలగు పుణ్యక్షేత్రములలో - పుష్కరాలు జరుగుతాయి. ఈ పుష్కరాలలో స్నాన దాన, పిండప్రదానము - అన్న దానములు జరిపిన అనంత పుణ్యములు లభించును.

**ఆంధ్రప్రదేశ్ :** ఈ నది తెలంగాణ రాష్ట్రంలోని భద్రాచలం నుండి ధవళేశ్వరం, కోటిపల్లి, ద్రాక్షారామం, ముక్తేశ్వరం, రాజమండ్రి, అంతర్వేది ద్వారా బంగాళఖాతంలోనికి కలుస్తుంది.

**గోదావరి మహానది పుట్టుక :** పూర్వకాలములో గౌతమ మహర్షి వరుణుని గూర్చి అఖండ తపస్సు జేసెను. అతని తపస్సునకు మెచ్చి వరుణుడు ప్రత్యక్షమై వరము కోరుకొమ్మనెను. అపుడు మహర్షి లోక కళ్యాణం కొరకు భూమిపై విత్తనములు చల్లిన వెంటనే మధ్యాహ్నం వరకు పంట పండునట్లు వరమడిగెను. వరణుడు "తథాస్తు" అని వరమిచ్చెను.

తర్వాత కొన్ని సంవత్సరములకు వర్షములు లేక దేశములో కరువు, కాటకాదులు ఏర్పడెను. ఆ సమయంలో కొందరు మహర్షులు గౌతమమునిని ఆశ్రయించి ఆయన వద్దనేయుండిరి. అపుడు గౌతముడు వరుణ వరప్రభావముతో ప్రతిరోజు విత్తనములు చల్లి మధ్యాహ్నం వరకు పండిన పంటతో అందరికి ఆతిథ్యమిచ్చి సంతోష పరచుచుండెను. ఒకనాడు మునులందరు లోక కళ్యాణమును కోరి శాశ్వత కరువు కాటక నివారణ కొరకు గంగను భూమిపై తెప్పించగల సమర్థుడని గ్రహించిరి. గౌతమ మహర్షుకి చిన్న విఘ్నమును కలిగించాలని నిశ్చయించుకొని, తను మహిమతో ఒక దర్భను గోవుగా చేసిరి. గౌతమునిచే సృజింపబడిన చేను మేయునట్లు చేసిరి. అది చూచి గౌతముడు ఆ ఆవును పారదోలుటకు తన వ్రేలుకు ఉన్న దర్భ పవిత్రను విసిరెను ఆ దర్భ స్పర్శతో ( గోవు) వజ్రాయుధంతో కొట్టినట్లుగా క్రిందపడి మరణించెను. గోవు మరణించుట జూచిన మహర్షి తన ప్రహారము చేత గోహత్యా పాపము సంక్రమించినదని బాధపడి, పరితపిస్తూ పాపము ఉపశమించుటకు గంగను, తేదలచి శివుని గూర్చి త్రియంబకేశ్వరములో (త్రి మూడు, అంబ - కనులు గల) గొప్ప తపస్సు చేసెను. శివుడు ప్రత్యక్షము కాగా. తన గోహత్య పాపము పోవుటకు గంగను ప్రసాదింపు మనెను.

1) విష్ణు పాదముల నుండి పుట్టి 2) బ్రహ్మ కమండలము నుండి 3) శివుని జటా జూటమున నిలిచిన త్రిపద గామినిని ఇచ్చుటకు ఒక జటమును ప్రసాదించెను. త్రయంబకేశ్వర కొండపై జటను పిండగా ఆ నీరు ప్రవాహముగా మారినది. గోహత్య పాతక హరణమునకు పుట్టినది. గోవు నాసికము నుండి నీటి చుక్కలు ప్రారంభం అగును. ఇప్పటికి అక్కడ గోవు నీటిలో తములపాకు పెట్టగా ఆకుపై నుండి చుక్కలు చుక్కలుగా పడుచున్నది. నోటి ద్వారా నీరు వచ్చిన దవడలగుండా కింది నుండి వచ్చును గాని పై భాగములో రావు. నాసిక రంధ్రం నుండి ఆకుపై పడి కిందకు చేరి నదిగా ఏర్పడుటచే ఆ ప్రదేశమునకు నాసిక్ అనే పేరుతో పిలువబడుచున్నది.

త్రయంబకేశ్వరంలో నాసికము నుండి పుట్టినందున నాసిక్, త్రయంబకేశ్వరమని జంట పేరు వచ్చినది. ఈ జలము ఆ గోవు శవముపై ప్రవహించగానే ఆ గోవు మళ్ళీ బ్రతికినది. అందుచేత గోదావరి యనియు, గౌతమ మహర్షి, తెచ్చినందున, గౌతమి, అనియు, శివుని జటా జూటమునందు నుండి వచ్చుట వలన గంగయను పేర్లతో ప్రసిద్ధిపొందెను. అక్కడి నుండి భూమికి ఇరుపక్కల సస్యశ్యామలం చేయుచూ, మూడు రాష్ట్రములలో త్రిపద 1) మహారాష్ట్ర 2) తెలంగాణ 3) ఆంధ్రప్రదేశ్‌లో ప్రవహించి అంతర్వేది, యానాందీవి ద్వారా బంగాళాఖాతములో కలియుచున్నది.



## తెలంగాణలో గోదావరి పుష్కరాలు

మహారాష్ట్ర నుండి నిజామాబాదు జిల్లాలోని రేంజల్ మండలం కందుకుర్తి వద్ద తెలంగాణ రాష్ట్రంలోనికి గోదావరి ప్రవేశించును.

**బాసర:** ఇక్కడ వేదవ్యాసునిచే ప్రతిష్ఠ చేసిన దేవాలయం జ్ఞాన సరస్వతీ దేవాలయం. పూర్వము ఈ ప్రాంతము ఇది ప్రశాంతమైన తపోభూమి. గోదావరి నదికి ఒక కిలోమీటరు దూరంలో నుండి వేదవ్యాసుడు గంగాస్నానం చేసి చేతిలో ఇసుకను తెచ్చి కుప్పగా వేసి సరస్వతి విగ్రహముగా ప్రతిష్ఠించెను. అమ్మవారి అనుగ్రహము కోరుభక్తులు దేవాలయ ప్రశాంత వాతావరణములో ధ్యాన్న, జపము చేయుచూ, జీవిత సార్థకతను పొందుచున్నారు. ఇక్కడ భిక్ష సాంప్రదాయం ఉంది. ఇచట అమ్మవారిని దీక్షను ప్రారంభించి ప్రతి నిత్యం అమ్మవారి ఆజ్ఞతో గ్రామంలో ఉన్న సత్ బ్రాహ్మణుల గృహములలో భిక్షను తీసుకొని, దానిని అమ్మవారికి నివేదించి స్వీకరిస్తారు. ఇక్కడి బ్రాహ్మణోత్తములు నిస్వార్థముగా తమ వద్ద నున్న అన్నంగాని, రొట్టె ఇతరములు ఏదైనా భిక్షగా ఎంతమంది వచ్చినను అందరికి పంచుతారు. సరస్వతీ మాతనే బ్రాహ్మణరూపములో దయా భిక్షను ఇచ్చి, విద్యా, ఉద్యోగ, జీవన సుఖములను ప్రసాదించుచున్నది. కాలక్రమములో ఈ క్షేత్రము తపోభూమి నుండి స్వార్థ పరుల వ్యాపారభూమిగా మారుచున్నది.

**ధర్మపురి :** బాసర క్షేత్రము నుండి గోదావరినది శ్రీరాంసాగర్ ప్రాజెక్టు క్రింద నుండి ధర్మపురికి చేరును.

పూర్వకాలంలో ధర్మాంగదుడు అనురాజుకు శాపముచేత సర్పము (పాము) కొడుకుగా పుట్టెను. దానిని పుత్రునివలె పెంచి, వివాహం చేయవలెనని నిశ్చయించి అనాటి ఆచారము ప్రకారం కత్తిద్వారా సత్యవతి అనుకన్యతో వివాహం చేయించెను. అత్తవారింటికి వచ్చిన సత్యవతికి కొంతకాలమునకు సత్యము తెలిసెను. ఆమె రాజును ప్రార్థింపగా రాజు శాపమును సర్పం జనన విషయమును చెప్పెను. సత్యవతి మహాపతివ్రతా ధర్మమునను అనుసరించి తన భర్తకు శాపవిమోచనము కొరకై సర్పముతో తీర్థయాత్రలు చేస్తుండగా అక్కడ ఒక మహానుభావుడు బ్రహ్మగుండమందు పతితో కలిసి స్నానమాచరించుమని చెప్పెను. ఆమె నిత్యం భర్తతో బ్రహ్మగుండములో స్నానం చేసి చేతితో దానిలో ఉన్న ఇసుకను గడ్డ మీదికి విసిరివేయుచుండెను. ఇక్కడ లక్ష్మీ నరసింహస్వామితో పాటు బ్రహ్మదేవుడు, యముడు కూడా ఆలయాలు ఉన్నవి. సత్యవతి భక్తితో తన భర్తతో కలసి స్నానం చేయగానే తన భర్తకు శాపవిమోచనము కలిగెను. ఆ సర్పము సుందర రూపముగల రాజకుమారుడుగా

మారెను. సత్యవతి విసిరిన ఇసుక ఎత్తుగా ధ్వజముగా మారెను. ఇప్పటికి అక్కడ లక్ష్మీ నరసింహస్వామి గుడిపక్కన సత్యవతి గుడి ఎదురుగా ఇసుక ధ్వజ స్తంబం బ్రహ్మ సత్యవతీ గుండములు ఉన్నవి. పూర్వం మహమ్మదీయులు పరిపాలనలో అల్లాఉద్దీన్‌ఖిల్జీ అనే నవాబు శ్రీ లక్ష్మినరసింహస్వామి గుడిని ధ్వంసం చేసి అక్కడ తన గుర్తుగా మసీదును నిర్మించెను. ఇది చక్కగా గోదావరినదికి ఎదురుగా ఉంది. ఆ విగ్రహములను తీసుకొని రెండవ లక్ష్మీ నర్సింహస్వామిగా ప్రక్కన క్రొత్తగుడి కట్టి మూర్తులను ప్రతిష్ఠించిరి. ఇదియే నేటి ధర్మపురిగా పిలువబడున్నదని ఇతిహాసముల ద్వారా తెలియబడుచున్నది. అప్పటినుండి ఈ ప్రదేశము ధర్మాంగదుని పేరున ధర్మపురిగా వెలసినది. ఈ గోదావరిలో స్నానం చేసి శ్రీ లక్ష్మీనరసింహస్వామిని - పూజించిన వారికి శాప, పాపములు తొలగి సుఖాలను పొందుతారు. ఈ ధర్మ పురిస్థల క్షేత్రము కాల సర్పదోష శాంతికి నివారణకై ఇది ప్రత్యేక స్థలము.

### కోటిలింగాల క్షేత్రము - రాయపట్నం - మంచిర్యాల :

ధర్మపురి నుండి మంచిర్యాల పట్టణమునకు దక్షిణాన గంగాతీరమున కోటిలింగాల ఉన్నది. ఇది పుణ్యస్నానాలు చేయుటకు పవిత్ర స్థలముగా నున్నది. ఇది కరీంనగర్ జిల్లా కేంద్రము నుండి లక్షెట్టిపేట రోడ్డు మార్గములో యండలి వెల్కటూరు మం॥ల పరిధిలో ఉంది.

ఒక వేయి సంవత్సరాల క్రితం శాతవాహనుల రాజధానిగా ఈ ఊరు ఉండేది. వారి కోటలో ఒక శివాలయం ప్రతిష్ఠించగా అక్కడి ప్రజలందరూ కోటలోని ఆ శివలింగమును పూజించిరి. ఆ కోటలోని లింగం కాలక్రమేణ కోటిలింగంగాను, కోటిలింగమనియు, కోటిలింగాలుగా మారి పిలువబడుచున్నది. ఇక ముందు ఆలయం కోట్ల లింగాలని కూడా మారవచ్చును. తర్వాత ఇక్కడి నుండి ఈ గోదావరి ప్రవహిస్తూ గోదావరిఖని (ఈ నీరులో పరిశుభ్రత ఉండదు) దాటి మంథనికి చేరును.

### మంథని :

మంథిని అనగా కవ్వము మధించినసారము. వెన్నెలాంటి జ్ఞానము, వేదా విద్యలు ఇక్కడ చిలుకబడినది. మంథినికి దక్షిణాన వారు ఉత్తరమున గోదావరి, మంథిని నాలుగు వైపుల నాలుగు ఈశ్వర లింగములు కలవు. పూర్వము గౌతమ ఋషి ఇచట విత్తనములను పొలమున చల్లి ఈశ్వర ఉపాసనచే మధ్యాహ్నం వరకు పంటను పండించి నిరంతరం అన్నదానం చేసేవాడు. గౌతమునిచే స్థాపించబడినది కనుక గౌతమేశ్వర దేవాలయముగా పిలువబడుచున్నది.

గౌతమ మహర్షి ఈశ్వరుని గూర్చి తపస్సు చేసి, పాడిపంటలు మధ్యాహ్నం వరకు ఫలాలు వచ్చునట్లు చేసి, కరువు కాటకాలను నివారించునట్లు, గౌతమేశ్వర



ఆలయం ప్రతిష్ఠించునట్లు ఈ గ్రామ పెద్దలు విశ్వసిస్తారు. ఇంకా గుప్తంగా ప్రౌఢ సరస్వతీ దేవాలయము, పశ్చిమ ముఖంగా భిక్షేశ్వర ఆలయం, ద్వాదశ హనుమదాలయములు కలవు.

### చెన్నూరు :

మంథని నుండి గోదావరిలో ఉపనది మానేరు నది కలుస్తుంది. అక్కడి నుండి గోదావరి ఉత్తరాభిముఖంగా ఐదు క్రోసులు ప్రవహిస్తుంది. ఏనదియైనను తూర్పు, దక్షిణము, పడమర దిశకు కూడా ప్రవహించును కాని ఉత్తర ప్రవాహములు అరుదు. ఇది కాశీక్షేత్రములలో మాత్రమే సంభవమైనది.

"పంచక్రోశం గయాం గంగాం" అని వచనము.

పురాణములో అగస్త్యమహర్షి శిష్యుడు వింధ్యా పర్వతేశ్వరుడు. ఇతడు అహంభావము చేత సూర్యగమనమునకు తన పర్వతము (దేహము)తో అడ్డముగా నిలచెను. కాలగమనమునకు అడ్డు పడిన వింధ్య పర్వతేశ్వరున్ని తప్పించుటకు దేవతలు తన గురువైన అగస్త్యున్ని ప్రార్థించిరి. దేవతల ప్రార్థనల ప్రకారం అగస్త్యమహర్షి కాశీని వదిలి దక్షిణమునకు వచ్చెను. కాల గమనమునకు అడ్డు ఉన్న వింద్యున్ని పర్వత శ్రేణి తగ్గించెను. వింద్యుడు గురువునకు నమస్కరించెను. (పర్వతశ్రేణి శయనించినది. అందువల్ల కాలగమనం జరిగింది) అటునుండి అగస్త్యుడు ఉత్తరవాహినిగా ఉన్న గోదావరి తీరాన కొన్ని రోజులు గడిపి ఒక శివలింగం ప్రతిష్ఠించెను. ఆ ఆలయం నేటికీ కలదు. అగస్త్యునిచే ప్రతిష్ఠింపబడిన దేవాలయం కనుక అంబా అగస్త్యేశ్వర ఆలయంగా పూజలందుకొంటోంది. కావున ఈ స్థలములో చేసిన స్నానం, దాన, పిండాదులు. పుష్కర స్నానాదులు చేసిన అనంతమైన కాశీ క్షేత్ర దర్శన ఫలములను ఇస్తుంది. దీనిని కొంచెము దూరంలో కాలభైరవ దర్శనం జరుగుతుంది. గోదావరి స్త్రీగా భావించబడినందున కాలభైరవుడిని చూచి తిరిగి తూర్పు దిశన గోదావరి ప్రవహిస్తుంది. ఎక్కడైనా శివుడు లింగ రూపంలో ఉంటాడు గాని అవయములుండవు. ఇక్కడ నాసికా రంధ్రాలున్నవి.

### కాళేశ్వరము :

చెన్నూరు నుండి గోదావరి, మహారాష్ట్ర నుండి ప్రాణహిత నది వచ్చి ఈ క్షేత్రము వద్దనే సంగమము (కలియున్నదని) జరుగును. అంతర్వాహినిగా సరస్వతి నది కూడా ఇచటనే కలియునందున త్రివేణీ సంగమమైనది. ఎంతో పవిత్ర క్షేత్రం శ్రీ కాళేశ్వర మహాక్షేత్రం.

కాశీక్షేత్రం మరణం, కాళేశ్వర దర్శనం, ముక్తికి మూలములు

ఇతి త్రివేణి సంగమ పవిత్ర ప్రదేశం. త్రివేణీ సంగములో అన్ని చోట్లా సరస్వతీ అంతర్వాహిని అని కంటికి కనబడదని చెప్పుదురు. ప్రతి మనిషిలోని విజ్ఞానం విద్య, సాహిత్యం, జ్ఞానంగా అందరిలోనూ సరస్వతి వాక్కు జ్ఞాన రూపములో నున్నది. అది ఎవరిలో ఏ స్థాయిలో ఉన్నదో కన్పించదు కావున రెండు నదుల కలయికలో ఏ మనిషి పోయి స్నానం చేసిన, అతనిలోని సరస్వతీతో త్రివేణి సంగమంగా చెప్పబడినది.

ఇలా గోదావరి నదిలో త్రిరూపంలో సంగమేర్పడుట వలన ఇది పవిత్రమైన మహానదిగా చెప్పబడినది. శంకరుని (శివుని) మూడు నేత్రముల కరుణా కటాక్షసారమే.

గోదావరి నది రెండు నాసికములు. ఒకటి నోటి నుండి వచ్చినది. నాసికము నుండి గంగాజలం పుట్టినట్లుగా తెలంగాణ రాష్ట్రంలోని కాళేశ్వర క్షేత్రములో శివుని రెండు నాసికా రంధ్రములలో పోసిన నీరు గోదావరినదిలో కలసి త్రివేణి సంగమంగా ఏర్పడును. నదీ సంగమమే కాకుండా జన్మస్థలం నాసిక ప్రతిరూపముగా నాసికా క్షేత్రముగా విజ్ఞులు తెలసికొని అందరికి తెలియచేయాలి.

త్రిలింగ దేశమునకు మొదటి లింగం కాళేశ్వరమే. దీనికి కొద్ది దూరంలోనే మహారాష్ట్ర సీర్లవంచ గ్రామం ముందుకు గచ్చిరోలి జిల్లా - చత్తీసుగఢ్ రాష్ట్రంలోని బస్తరు జిల్లాను తెలంగాణ రాష్ట్రం కరినగర్ జిల్లా ఒక మండలం మందు విడదీసి ఇంద్రావతీనది కలసిన స్థలం త్రివేణీ సంగమ క్షేత్రమైనది.

కాళేశ్వర నివాసోవా కాళేశ్వర నిరీక్షణం ।
కాళేశ్వర పూజనంచ, పునర్జన్మ నవిద్యతే ॥

కాశ్యాంతు మరణాన్ముక్తి :

కాశీక్షేత్రంలో యాదృచ్ఛికంగా చనిపోయిననూ ముక్తి లభించును కాని కాళేశ్వేరున్ని అనుకోకుండా దర్శనం చేసుకున్నను ముక్తి లభించును. గౌతమముని కాక ఏ గొప్ప తపస్సంపన్నులకో ఎటువంటి దోషం చేతనో శాపగ్రస్తమై నేడు బ్రాహ్మణ రహితం, వేద విద్యారహితంగా ఈ కాళేశ్వర గ్రామ పూర్వులు అభిప్రాయము.

ఇది కరీనగరం జిల్లా మహాదేవపురం అనే మండలంలో ఈ నదీక్షేత్రములు ఉన్నవి. మహారాష్ట్ర, తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ (స్వర్గ-మర్త్య-పాతాళ) మూడు రాష్ట్రములో ప్రవహించుచున్నది. కాశీలోని గంగవలె ప్రవాహము. కాల భైరవ దర్శనం, భద్రాద్రి శ్రీరామ దర్శనం గల ఈ గోదావరి నది ప్రవహిస్తూ ఉండటం



ఈ మానవుల ఎన్నో జన్మల పుణ్యఫలము. ఈ గోదావరి నదీ పుష్కర సమయములో చేయు, స్నాన, దాన, పిండ ప్రదానములకు త్రి జన్మ పాపములు నశించునని తెలియుచున్నది.

భద్రాచలము :

తెలంగాణ రాష్ట్రంలో గోదావరి ప్రవాహమునకు చివరి క్షేత్రం భద్రాచలము. (దండకారణ్య, శ్రీరామక్షేత్రం) శ్రీ మన్మహావిష్ణువు శ్రీరామావతారమున అరణ్య వాసమునందు శ్రీరాముడు సీతా లక్ష్మణ సమేతుడై ఈ తీరమున చాల రోజులు నివసించెను. శ్రీరామ, సీతా, లక్ష్మణుల పాదములు సంచరించిన భూమి ఎంతో పవిత్రమైనది పుణ్యప్రదమైనది. ఇచటనే కోదండరామస్వామి కొలువుతీరి ఉండుటచేత దీనిని అయోధ్య పట్టణముగా భావింపవలెను (గ్రహించాలి) ఇది అయోధ్య, మధుర, మోక్ష పట్టణముగా అనుగ్రహిస్తూ గోదావరీ ప్రవహించిన అన్ని రాష్ట్రప్రజలకు మోక్షమును ప్రసాదిస్తుందని అనుటలో ఏ సందేహము లేదు.

ఈ భద్రాచలము తెలంగాణరాష్ట్రంలోని ఖమ్మం జిల్లాలో ఉంది. ఈ భద్రాచలములో కంచెర్ల గోపన్న, నిర్మించిన క్షేత్రమే ఇక్కడి రామాలయ క్షేత్రము. పవిత్రమైనది. మహితాన్వితమైనది.

## పంచవటి - పర్ణశాల ఐదు మర్రి వృక్షములు - ఆకులగుడిసె

రామాయణం లక్షల సంవత్సరాల క్రితం జరిగినది. దాని స్థలములు నిర్ణయము చేయదలచినపుడు ఏదో ఐదు వృక్షములను జూపి, ఆకుల గుడిసెను చూపి నిర్ణయించకూడదు. వృక్షములు, గుడిసెలు లక్షల సంవత్సరాలు ఉండవు. పర్వతములు, నదులు మాత్రమే ఉండును. శ్రీరాముడున్న, పంచవటి నిర్ణయమునకు రామాయణము ఆధారముగా నిర్ణయించి చెప్పాలి.

ఇందుకు వాల్మీకి రామాయణమే ప్రమాణము. ఆంధ్ర వాల్మీకి బిరుదాకింతులు వావికొలను సుబ్బారావు గారు దీర్ఘ వ్యాధితో బాధపడుతూ రామాయణములో చెప్పిన ప్రదేశములన్నియు తిరిగి శ్రీరామ చరిత్రను క్షీరసాగరముగాను చేసి మందరమనే పర్వతముతో మదించి అమృతము తీసిన మహానుభావుడు. వీరు తెలుగు పద్యవచనముగా అన్ని విషయములు యథావిధిగా ఉండును.

ఉదా: తతోరావణ నీతాయా:

తెలుగు:- తర్వాత రావణాసురుడు తన ముఖము అద్దములో చూచుకున్నట్లుగా వ్రాసిన మహానుభావుడు, వాల్మీకి రామాయణము అయ్యోధ్యకాండ 15వ సర్గలో వ్రాసిన దాని వివరము విశ్లేషణతో వ్రాసినారు. పేజీ (168-169- అరణ్యాకాండం)

సంక్షిప్త వివరణ :

సీతాపహరణము తర్వాత పర్ణశాలకు వచ్చిన రామలక్ష్మణులు సీతమ్మను వెదుకుతూ గోదావరినది వరకు పోయి వెతికినట్లు గోదావరి నది పశ్చిమ (పడమర) దిక్కుయందు పర్ణశాల రథము అనే గుట్టయున్నది. (ఇప్పటి పర్ణశాలకు) రావణుడు గుట్ట చాటుకు రథమును ఆపెను. పశుపక్షాదులు రామునికి దక్షిణమార్గము చూపుటచే అటు వైపు హంపీ (కిష్కింధ) కి కావున నైఋతిగా వెతికిరి. ఈ ప్రమాణమను సరించి నాసిక్‌లో ఉన్నది పంచవటి కాదు. ఇది గోదావరి నదికి పశ్చిమముగా ఉన్నది. ఇప్పటికి ఖరదూషణాదులు యుద్ధ స్థలం ఇక్కడ కలదు. గుట్టపై గల పర్ణశాల నుండి సీతాలక్ష్మణులు యుద్ధమును వీక్షించిరి.

తెలంగాణ రాష్ట్రంనుండి గోదావరి నది ఆంధ్రప్రదేశ్ ధవళేశ్వరం, రాజమండ్రిద్వారా సముద్రములో కలిసేప్పుడు విడివిడిగా మూడుపాయిలుగా మారెను. ఉత్తర శాఖ (పాయ) గౌతమీ గోదావరి పేరుతో యానాం వద్ద, మధ్యపాయ వశిష్ఠ గోదావరినదిగా నర్సాపురం వద్ద అంతర్వేదిలో, దక్షిణపాయ వైనతేయ మనే పేరుతో కొమరగిరి పట్నం వద్ద కలుస్తుంది. ఇది త్రిపరగామి, త్రివేణీ సంగమము కావున చాలా పవిత్రం అయినది.

### వచ్చే సంవత్సరము కృష్ణానది పుష్కరాలు.

### సింహగురువులో చేయదగినవి

గురువు సింహరాశి సంచారమందు అంతటను చేయదగినవి.

సీమంతం, జాతకర్మ, నామకరణం, అన్నప్రాశనం, గ్రహచార శాంతులు, షష్టిపూర్తి దేవాలయ వార్షికోత్సవములు, శ్రార్ధాది కర్మలు కామ్యా వ్రతములు. ప్రతి సంవత్సరములో చేయు కుల ధర్మ మంగళ శారి, అక్షతదియా వరలక్ష్మి వ్రతం, కేదారవ్రతాదులు ఉద్యాపనలు సత్యనారాయణ వ్రతాదులు చేయవచ్చును.

### సింహసగురు దోషం ధర్మప్రవృత్తి

సింహరాశిలో ఏదినము గురు ప్రవేశమగునో ఆదినమందు గోదావరినదీపుష్కర స్నాన, దాన, పిత్రుకర్మలా చరించినవారికి కోటి జన్మముల పాపముహరించబడును. శ్లో॥ సింహరాశిగతో యస్మిద్దినే సుర గురోభవేత్ తస్మింస్తు గౌతమీ స్నానం కోటి జన్మాఘనాశనం (బ్రహ్మ పురాణం).

ఈ పుష్కరములు గురువు సింహరాశిలో ప్రవేశించినదినమునుండి 12 రోజులు మహాపుష్కరములును. ఒక సంవత్సరమువరకు మధ్యాహ్న సమయం 4గంటలు సాధారణ పుష్కరములు చివరి 12 రోజులు అంత్యపుష్కరమగును. గోదావరి పుష్కర



విశిష్టత పురాణములలో చెప్పినట్లు ఏనది పుష్కరకు కూడా చెప్పబడలేదు. దీనికి చేయవలసినవి, చేయదగినవియనియు, దేశభేదమందనియు విశేషముగా చెప్పబడినవి. సింహ పూర్వార్ధసంచారము 15-9-15 వరకు శుభకార్యములు నిషిద్ధం.

ఈ కాలమందు గోదావరీ తీరమున క్షౌరమునకు చాలా విశిష్టతయున్నది తండ్రి జీవించి యుండినను, వివాహమైనను, భార్య నవమాసములగర్భవతియైనను జాతాశౌచమున్నను. నిస్సందేహముగా క్షౌరము చేయించుకొని ప్రాయశ్చిత్త గంగాస్నాన దానాదులు చేసినచో కోటిజన్మపాపములు పోవును.

## సింహగురువులో చేయగూడనివి

శ్లో॥ మఘాదిపంచపాదేషు గురు సర్వత్రవర్జితా ॥

సంహమందు 5 పాదములు సంచరించు సమయము అన్నిదేశములయందు శుభకార్యములు చేయగూడదు. గోదావరి తప్ప ఇతర యాత్రలు, ప్రతిష్ఠలు, చేలం, ఉపనయనం వాస్తు కర్మంది శుభకార్యములు నిషిద్ధం. గోదావరి గంగానది మధ్యస్థులకు ఒక సంవత్సరము కూడదు. ఇతరదేశములయందు చేయవచ్చును. ఆపత్కాలమందుఉత్తరతీరస్థులు గోదావరికి దక్షిణదేశముపోయిచేసుకొన వచ్చును గురువు వక్రమునందు తిరిగి మఖకు వచ్చినను దోషములేదు గోదావరి దక్షిణదేశస్థువు. 15-9-15 తదుపరి అన్ని శుభకార్యములు చేయవచ్చును.

### లగ్నము - రాసులు

లగ్నమనగా కలయిక, రెండు ఒకటిగా కలిసిన దానిని లగ్నం అంటారు. తాము చూచుస్థల భేదములు అయినప్పుడు, లగ్నములు ఫలములు బేధమగును. పురుషున్ని తీసుకవచ్చి ఒక కన్యను ఇచ్చి ఒకటిగా చేయుటకు, తన మనస్సును భగవంతునిపై కాని మరిదేనిపై గాని లీనము చేయుటకూ లగ్నమంటాము. ఖగోళమందు. భచక్రమును 12 భాగములుగా చేయబడినది. దీనిలో 27 నక్షత్రకూటములకు కూర్చబడినది. ఇది రవ్యాది సప్తగ్రహముల సంచారము పరిధిలో ఉండును. మనము నిలబడి ముందుకు దూరంగా చూచిన అక్కడ భూమాకాశములు కలసి ఒకటిగాయున్నట్లు కనపడును. ఈ కలయిక లగ్నముగా చెప్పబడుచున్నది. ఇక్కడ భూమిపై భాగములో గల రాసులలో నుండు గ్రహప్రభావములు మనకు ఇచ్చును. క్రూర, సౌమ్య, శుభఫలములు ఆస్థానమునకు వారుండు దూరమునకు సరించి ఇత్తురు. అది శుభగ్రహయుక్తముగా నుండిన శుభములను, పాపగ్రహ సమీపమునందున్న అశుభములను కలుగజేయుదురు. ఆ లగ్నముగా చెప్పబడు

స్థలమే మనము ప్రతి కార్యమునకు చూచుకొను లగ్నము తాము చూచు స్థల భేధములు అయినప్పుడు లగ్నఫలములు భేదమగును. ఇది వివాహాది శుభకార్యములు మొదలు ఉపనయన గృహారంభ, గృహప్రవేశ, జననకాల జాతకములలో కష్టసుఖ లాభనష్టములు కలుగజేయును.

పై 12 భాగములకు అవి ఉన్న ఆకారమునసుసరించి వాటికి పేరు మేషాదిగా నిర్ణయించబడినది. ఒక్కొక్క భాగము ఐదు ఘడియలు సుమారు 2 గంటలు కనిపించును. తదుపరి సూర్యగమములు ననుసరించివెనుకది ముందుకు కన్పించును.

## గడియార నిర్మాణం

మన విజ్ఞాన వేత్తలు ఈగమనవిధానములు మనము తెలుసుకొనుటకు గడియారమును యంత్రమును నిర్మించిదానిలో 12 భాగములు ఏర్పరచిరి. ఇవి ద్విగుణీకరించి రాత్రి పగళ్లుగా రోజుకు 24 గంటలుగా చూపుచున్నది. పూర్వము మన ఋషులు చెప్పిన ఖగోళశాస్త్రమునే విడదీసి చేయబడినది. గ్రహముల నడక ననుసరించి ప్రధానగ్రహములు. గురువు - శనులతో నిర్మించబడినది.

ఒకటవ భాగము (మేషం) నుండి బయలుదేరిన గురుశనులు ఇద్దరు మళ్లీ మేషంలోకి వచ్చు వరకు 60 అరువై సంవత్సరములకాలము (ఒక కాలచక్రము) ఈ కాలచక్ర ప్రమాణము నిమిషములుగా మనకు తిరుగుటచే ప్రతి సంఖ్య 5 ని॥రాశిచక్రము 12 × 5 = 60 పెద్దముల్లు చూపబడుచున్నది. బ్రహ్మ ఆయువును. తెలుసుకొనుటకు మూలం. గురువు సం॥నకు ఒక రాశి చొప్పున ఒకసారి తిరుగుటకు 12 సం॥లును. శని 2 1/2 సం॥లకు ఒక రాశి చక్రము చొప్పున 30సం॥ కాలముపట్టును. ఇలా శని 2రాశి చక్రము తిరుగుటకు 30 ×2 = 60సం॥ గురువు 12 × 5 = 60లు పట్టుటచే 60సం॥ ఒక కాల చక్ర కొలతగా నిర్ణయించిరి. గడియారం ఆకారము భూమివలె గుండ్రముగనుండి 12 భాగలను చూపుచుండును. చిన్నముల్లు (శనిగా) రెండుసార్లు తిరుగడా ఒకరోజు అగుచున్నది. గురువు 5 సార్లు

రాశిచక్రము తిరుగుటచే ప్రతిసంఖ్య 5ని॥ 12×5 = 60 పెద్దముల్లు చూపబడుచున్నది.

రాశులు లగ్నమనగా కలయిక, రాశియనగా కుప్ప అని అర్థము. ఒక్కొక్క భాగవిస్తీర్ణములో గల చుక్కల రాశిని ఆభాగం ఆరాశియందురు. ఇది చంద్రుని సంచారము ననుసరించి తెలియుచున్నది. గ్రహములు ఏ నక్షత్ర ఏభాగమందున్నదో గ్రహించి ఆలగ్నమందు చూచుకొనబడును. ఇది గోచారాది జాతకఫలములు తెలుపును.



## పండుగల నిర్ణయములు ఉపాకర్మ విషయము : ధర్మసింధు పేజీ 89,90,91

అన్నిశాఖలవారికి ఉపాకర్మ చేయుటకు శ్రావణమాసమే ముఖ్యం విత్తనములు మొలకెత్తుటకు అనుకూల సమయము శ్రేష్ఠము ఋగ్వేదులకు శ్రవణానక్షత్రం యోగ్యం, యజుర్వేదులకు పూర్ణిమాతిథియు, సామవేదులకు కుజమౌఢ్యంలేని పంచమి హస్తతో కూడుకొనునది విశేషము. అధర్వణులకు పూర్ణిమా గ్రాహ్యం, సామవేదులకు గురు, శుక్రమౌఢ్య దోశము వర్తించదు. నర్మదా ఉత్తర దేశస్థులు సింహసం క్రణముండుటయు దక్షిణులకు దక్షిణాయనమే గ్రాహ్యం. పైవాటికి సంక్రమణ మౌఢ్యాదిదోషములు కలిగినప్పుడు భాద్రపదమందు హస్తానక్షత్రము గాని పంచమితిథిగాని శుభములు. మిగతావారికి భాద్రపదమాసమందు శ్రవణమందు అశ్వలాయములు పూర్ణిమారోజు ఆపస్తంబులు, అధర్వణ శాఖవారికి ఆచరణీయం. ఈ మన్మథనామ సం॥ శ్రావణమాసం గురుమౌఢనం మున్నందున భాద్రపద శు౩ మంగళవారం హస్తా 15-9-2015న, ఋగ్వేదులు భాద్రపదశు౧౧ గురువారం శ్రవణం 24-9-15నను. యజుర్వేదులు, అధర్వణవేదులు, భాద్రపద శు పూర్ణిమ సోమవారం 28-9-2015న ఆచరించవలెను. ఇది సనాతన వటువులకు అని గ్రహింపవలెను.

**మహోదయం** ఈ సంవత్సరము పుష్యబ30 సోమ తేది 8-2-2016 రోజునకు ఆదివారంలోపించి అమావాస్య, శ్రవణ నక్షతం వ్యతీపాతయోగమున్నందున మహోదయమైనది. ఈ యోగం కోటి సూర్యసయమైనది. ఈ యోగముందు సముద్రస్నానం, పుష్కర గోదావరి యందు స్నాన,జప హిరణ్య, శ్రార్థమాచించిన సప్తతరములవారు తరించురు.

## సంధ్యాకాలము

మానవుని నిత్య జీవిత దిన చర్య యందు కాలచక్రమును మనకు నిర్దేశించినారు. బ్రహ్మవయో గణితమును మానవులు లెక్కించుటకు సాధ్యం కానందున సూర్య భగవానుడు మయాసురునకు చెప్పిన గ్రహ భ్రమణములను (భగణాదులుగాను, కల్పాదులుగా, యుగాదులుగా, మన్వాదులుగా, శకాదులుగా, చేస్తూ మానవ గణితమునకు సరిపోవునట్లు) రవ్యాది సప్త గ్రహములు ఆయనములు. ఋతువులు, మాసంలు, పక్షంలు, తిథులు, నక్షత్రములు, యోగ, కరణములుగా, సూక్ష్మీ కరించిరి. మానవ గణితములో 864కోట్ల సం॥ములకు బ్రహ్మకు ఒక దినమగును. పగలు 432కో. రాత్రి 432 కో పగలు 14మనువులు రాత్రి 14 మనువులుందురు. ఒకదినమునకు 60ఘడి॥పగలు30ఘడి॥ ఒక మనువు2ఘడి॥ చొప్పున 25ఘడి. పోగా మిగిలిన 2ఘడి॥ బ్రహ్మకు సాయం సంధ్యాకాలం. ఇలాగే ప్రాత:స్సంధ్యా కాలమగును. వెలుగు నుండి (కష్టం) చీకటిపోవునపుడును, చీకటినుండి (సుఖం) వెలుగులోనికిపోవునపుడును, దైవ ప్రార్థనచేయుట ఇహపరసౌఖ్యములను ఇచ్చును. ప్రాత:కాలమందు (మార్గళి) విష్ణు దేవుని, ప్రదోషమందు శివార్చన చేయబడుచున్నది. ఇది ఉదయం 2ఘడి. సాయంత్రం2ఘడి. ఇదియే సకాల సంధ్యావందనసమయంగా నిర్ణయింపబడినది.

## అధికమాసంలో చేయదగిన పనులు

నిత్య నైమిత్తిక, కామ్య కర్మలు ఉపనాసైక భక్తనక్తో యాచక దాన వ్రతములనెడి కార్యములను జాతకర్మ, నామకరణ, పుంసవన, సీమంత, జననశాంతి అనావృష్టి, గ్రహశాంతులు, ప్రేతకర్మలు చేయుటకు, చాంద్రయనవ్రతం, చాతుర్యాస్య నందు చేయబడువ్రతములకు అధికమాసము దోషము లేదు. గర్భమందు, భృతుని జీతమందు, సపిండీకరణమందు మాసిక శ్రాద్ధయందు అధికమాసము విడువరాదు. జయ సం॥ ఆషాడం మాసములో మరణించిన వారికి మన్మథ సంవత్సరం అధిక ఆషాఢమందే పిండసహిత శ్రాద్ధయు చేయవలెను. ప్రత్యబ్ధములు పిండరహితముగా చేయవలెను. అనగా మరణతిథిని విడువరాదు కనుక పితృ ప్రీతిగా బ్రాహ్మణునికైనా భోజనము పెట్టవలెను. తిరిగి నిజభాద్రపదమందు పార్వణశ్రాద్ధయు చేయవలెను.

## అధికమాసంలో చేయకూడని పనులు

నూతన జపానుష్ఠానము ఎప్పుడుచూడని తీర్థయాత్ర అన్నప్రాశన, అక్షరాభ్యాసం సర్వ ప్రాయశ్చిత్తము, వివాహ, ఉపనయనములు ఆశ్రమస్వీకారం, గర్భదానాది సమస్త శుభ కార్యములు చేయకూడదు.

చాంద్రమానం నకు అధిక మాసమేర్పడును. ఒకసూర్య భ్రమణమునకు 365 రోజులు. ఒక చంద్ర భ్రమణంకు 354 రో. ఈ ఇద్దరిమధ్య భేదము సంవత్సరమునకు 11 రోజులు ఇలా మూడు సంవత్సరములకు 33 రోజులగును. ఒక అధికమాసమగును. దీనిని పురుషోత్తమ మాసమని మల మాసమని నపుంసక మాసమని అందురు. ఈ మాసములో 33 కోట్ల దేవతల పూజలు చేయవలెను. పూజా దానాదులవలన అధికపుణ్యములు కల్గును. కావున ఈ నెలారంభం, నుండి గురూపదేశ మంత్రం రోజుకు 1100ల చొప్పున నెల చేసినచో 33000. అగును. 33 దేవతా విగ్రహములకు పూజ చేసి 33మంది బ్రాహ్మణులకు వస్త్రములు భోజనములు దానం చేయవలెను. లేక 33 మంది సుహాసినులకు భోజనవస్త్రములను దానము చేసినచో అనంత పుణ్యములు గల్గును. ఈ మాసమదురు ఏటువంటి శుభకార్యములు చేయకూడదు. కాని నిశ్చయములు చేయవచ్చును.



## ప్రథమ రజస్వల విషయములు

శుక్ల, కృష్ణపక్షములలో 1, 4, 6, 9, 12, 14, 15, 30 ఆది, మంగ, శనివారములు భర, కృత్తి, ఆర్ద్రా, పున, ఆశ్లే, మఖ, పుబ్బ, జ్యేష్ఠ, పూషా, పూ.భాల యందును. వర్జ్య దుర్మూహూర్తముల యందును, ప్రథమ రజస్వల అయిన శాస్త్రయుక్తముగా శాంతి చేసిన శుభములు కలుగును. కృత్తి 4, మఖ, ఆర్ద్రా 5, జ్యేష్ఠ, పున, ఆశ్లే, పుబ్బ, పూషా 1, 2 భరణి 2, మాసములు పతి సంయోగము పనికి రాదు. ప్రాత్ణకాలమున సౌభాగ్యవతి పూర్వాహ్ణం తీర్థయాత్రలు చేయునది మధ్యాహ్నం ధనవతియు, సాయంకాలం జారిణాయు, సంధ్యలయందు దేశ్చేష్టరాలు, పూర్వరాత్రియందు దీర్ఘాయువు గలది, అర్థరాత్రి యందు విధవయు, ఉష్ణ కాలంయందు సౌభాగ్యహీనురాలగును. భర్త జన్మనక్షత్ర మందైనను విధవయగును. కావున శాంతి చేయుటచే దోషపరిహారమగును.

## కుజ దోష విచారము

కుజ దోషములేని నక్షత్రములు అశ్వి, మృగ, పున, పుష్య, ఆశ్లే, ఉత్త , స్వాతి, అనూరాధ, పూషా, శ్రవణం, ఉభా, రేవతి నక్షత్రములయందు జన్మించిన వారికి కుజదోషములు లేవు.

జన్మ లగ్నములకు 1-2-4-7-8-12 కుజుడుండిన పురుష కుజ దోషమగును. స్త్రీ, పురుషులిద్దరి జాతకమునకు కుజ దోషముండిన దీర్ఘకాలం ఆయు రారోగ్యములు, కలిగి యుందురు.

మిథున, కన్యా లగ్న జాతకులకు 2వ కుజదోషము మేష, వృశ్చిక లగ్నములకు 4వ మకర, కర్కాటక లగ్నములకు సప్తమ దోషము, ధనస్సు, మీనములకు అష్టమ దోషము వృషభ లగ్నమునకు 12 దోషము లేదు.

జాతకమందు కుజుడు, గురు, చంద్ర బుధులతో కూడినను చూడబడినను కేంద్ర కోణములందుండినను దోషము లేదు.

కుజుడు తృతీయ సప్తమాధిపతినిగాని పూర్ణచంద్రుడు బుధ, గురు, శుక్రులలో నెవరితోనైనను చూడబడినను లేదా దశమ స్థానమందు శుభ గ్రహములుండినను మేష వృశ్చిక కర్కాటక సింహ ధనుస్సు మకర మీన లగ్నములందు పుట్టినను కుజ దోషము లేదు.



## వ్యాపార స్థలము (దుకాణము) లోని జాగ్రత్తలు :

ఉదయము లేచి పరిశుద్ధుడై : ll ఇష్ట దేవతలను పూజించి: దేవుని స్మరిస్తు దుకాణము తాళము తీసి ఎవరితో మాట్లాడక కుడికాలు మోపి లోనికేగి మహాలక్ష్మికి నమస్కరించి దుకాణము ను శుభ్రపరచవలెను. దేవతలను గల్లాకుధూప, దీప, నైవేద్యం చూసి వ్యాపారారంభము చేయవలెను. సాయంత్రం దుకానం మూయునప్పుడు ఓం నమో భగవతి మహాదుర్గే మమపణ్యగేహె వివిధవస్తు ద్రవ్యాదీన్, అగ్నివాయుజల, మహాంధకార ఉల్కాపాత, చోర, వైరి, భూత, విద్యుదనల, శస్త్రాస్త్రాదిభ్య సర్వాయుధ హస్తాభ్యాం రక్ష రక్ష। సర్వతోమాం రక్ష రక్ష హుంఝుళి స్వాహా ।అని తాళము వేయవలెను. మరియు కార్తవీర్యార్జునో నామరాజా బాహుసహస్రవాన్ తస్యస్మరణ మాత్రేణ చోరబాధా వినశ్యతి॥ అని తాళం గుంజిచూచి ॥ఓం॥ నమో భగవతే కార్తవీర్యార్జునాయ మహాభుజ పరిపాలిత సప్తద్వీపాయ అస్మద్వస్తు ద్రవ్యాది విలుంపక చోరాన్ ఠఠఠ ఓం॥ఫ్రోం, హ్రీం-క్లీం-బ్లూం-ఆం-హ్రీం.క్రోం-శ్రీం హుం ఫట్‌కార్త వీర్యార్జునాయ స్వాహా ॥ అని తాళం మరలగుంజిచూచి నమస్కరించి, ఇష్ట దేవతను స్మరిస్తు గృహమునకు వెల్లవలెను.

## సంవత్సరముల పేర్లు

1. ప్రభవ, 2. విభవ, 3. శుక్ల, 4, ప్రమోదూత, 5. ప్రజోత్పత్తి, 6. అంగీరస, 7. శ్రీముఖ, 8. భావ, 9. యువ, 10. ధాత, 11. ఈశ్వర, 12. బహుధాన్య, 13. ప్రమాది, 14. విక్రమ, 15. వృష, 16, చిత్రభాను, 17. స్వభాను, 18, తారణ, 19. పార్థివ, 20. వ్యయ, 21. సర్వజిత్, 22. సర్వధారి, 23. విరోధి, 24. వికృతి, 25. ఖర, 26. నందన, 27. విజయ, 28. జయ, 29. మన్మధ, 30. దుర్ముఖి, 31. హేవలంబి, 32. విలంబి, 33. వికారి, 34. శార్వరీ, 35. ప్లవ, 36. శుభకృత్, 37. శోభకృత్, 38. క్రోధి, 39. విశ్వావసు, 40. పరాభవ, 41. ప్లవంగ, 42. కీలక, 43. సౌమ్య, 44. సాధారణ, 45. విరోధికృత్, 46. పరీధారి, 47. ప్రమాదీచ, 48. ఆనంద, 49, రాక్షస, 50. నల, 51. పింగళ, 52. కాళయుక్తి, 53. సిద్దార్థి, 54. శాద్రి, 55. దుర్మతి, 56. దుందుభి, 57. రుధిరోద్గారి, 58. రక్తాక్షి, 59. క్రోధన, 60. అక్షయ.

**యోగములు :** 1. విష్కంభం, 2. ప్రీతి, 3. ఆయుష్మాన్, 4.సౌభాగ్యం, 5. శోభనం, 6.అతిగుండం, 7. సుకర్మ, 8.ధృతి, 9.శూల, 10. గండ, 11. వృద్ధి, 12. ధృవ, 13. వ్యాఘాత, 14. హర్ష 15. వజ్రం, 16. సిద్ధి, 17. వ్యతీపాత్, 18. వరీయాన్, 19. పరిఘం, 20. శివ, 21. సిద్ధసాధ్యం, 22. శుభ, 23. శుక్ల, 24. బ్రాహ్మ, 26. ఐంద్ర, 27. వైధృతి.

**కరణములు :** 1. బవ, 2.బాలవ, 3. కౌలవ, 4.తైతుల, 5.గరజి, 6.వణజి, 7.భద్ర, 8.శకుని, 9.చతుష్పాత్, 10.నాగపం, 11.కిమస్తుఘ్నం నాల్గుస్థిరములు ఏడుచలించునవి.



## వాస్తువివరణ

మానవులకు ఆయురారోగ్య సుఖసౌఖ్యములిచ్చుటకై ఋష్యాదులు, తపశక్తితో మననివాసములు వివరణ, ఆచార వ్యవహారములను నిర్దేశించినారుఇంటియందుపెట్టుకో బడు వస్తువుల ప్రభావం తెలుపునది వాస్తుశాస్త్రము. ఈశాస్త్రానుసారముగానివాసమొనర్చి కొనిన ఆయురారోగ్య సుఖశాంతులు చేకూరును. కావున ఋషి ప్రోక్తమగు గ్రంధములే ప్రామాణ్యములు, విద్యావంతులు వస్తువు గృహమందు ఉంచబడుదానినిఆధునికముగా అర్ధమగునట్ట తెలిపిన విజ్ఞా నముపెరుగును.

## ఊరచ్చుబాటుకు

నామ నక్షత్రం మొదలుకొని గ్రామము మొదటి అక్షర నక్షత్రము వరకు లెక్కింపగా 5 నక్షత్రములు శిరస్సున ఐదు అర్దలాభం తర్వాత మూడు నక్షత్రములు ముఖమందు అర్ధనాశనము తర్వాత 5 హృదయమందు ధనధాన్యము తర్వాత 6 పాదములందు దరిద్రము 1 వీపున భయం, తర్వాత 4 నాభియందు సంపద తర్వాత 2 గుదమందు ప్రాణ భయం 1 ఎడమచేతిలో దరిద్రం ఈవిధముగా పేరుతోనే ఊరచ్చుబాటు చూచుకొనుట శ్రేష్టము

## గృహము కట్టరాని స్థలములు (వాస్తుసారము)

గోవుల మందలుండు స్థలమందు, మలవిసర్జనం, స్మశానము, ఉప్పునేలల యందు, నీరు పారు స్థలములయందు, నిందిత స్థలములందు ఇల్లు కట్టకూడదు. శివుని గుడిముందు 200 మీటర్లలోపు, విష్ణు ఆలయము వెనుక 40 మీటర్లు, అమ్మవారి గుడికి ఎడమప్రక్కన 50మీటర్ల లోపు, బురుజు మూలల చూపు గల స్థలములందు గృహ నిర్మాణము చేసిన సిరులు నశించును. దేవాలయము గోపురం నీడ ఇంటిపై పడిన యజమానికి కీడు కలుగును. పాత ఇంటి కట్టె ద్వారములు, ఇటుక, మన్ను మొదలగునవి వేరే ఇంటికి కొత్త ఇంటికి వాడకూడదు.

**శూలలు :** బజారునకు ఎదురుగా వాకిలి యుండిన యజమానికి గండం స్తంబములు ఎదురుగానుండినను, ఇంటి పొరుతప్పి నిర్మించినను భార్యకు కీడు శిఖరం పోటీవచ్చిన సకల దుఃఖములకు మూలము. మూలల యందు వాకిలి పెట్టిన మృత్యుభయమును కలుగును.

## ఇంటియందు నివసించు విధానం

భవనంనాల్గు-ఐదుఅంతస్థులుగానిర్మించిన ఇంటిలోముందుగా నిర్మిచిన దానిలోపెద్దవాడును, తర్వాతదానిలో రెండవవాడు,3,లోమూడవవాడు, నాల్గులో నాల్గవాడుఉండవలెను. దీనికి వ్యతిరేకంగా మొదటిఇల్లును కిందిదని, నాల్గవిల్లు

పైదని,నిర్ణయించిపెద్దవాడునాల్గవింటిలో నున్న సిరులు తొలగును. భూమిపైవరుసగా తూర్పు, ఫడమరగానున్న, పడమరనుండియు, ఉత్తరదక్షిణం గాయున్న దక్షిణభాగము నుండియుపద్దవాడుమొదలువరుసగానండిన సిరిసంపదలుకల్గును. వాయువ్యమందును, మేషరాశివారు ఉత్తరమందును, కుంభరాశివారు ఈశాన్యమున ఉండకూడదు. తూర్పు, ఉత్తరముల పెద్దవాడుండినను దక్షిణ, పడమరలయందు చిన్నవాడు యుండిన ఐశ్వర్యములు తొలగును. కావున విషయాలను బాగుగా పరిశీలించి నివాసము ఏర్పరుచు కొనవలయును.

## గ్రామమునందు ఇంటి దిశలు

జన్మరాశి రీత్యా గ్రామంలో నివాస నిషిద్దములు, వృషభం - మిథునం - సింహం - మకరం ఈ రాశివారు గ్రామ మద్యముందుండరాదు. వృశ్చిక రాశివారు తూర్పునను, మీనరాశివారు ఆగ్నేయమును, కన్యారాశివారు దక్షిణమును, కర్కాటక రాశివారు నైబుతి యందును, ధనురాశివారు పడమర, తులారాశివారు రాశిని బట్టి గృహ ముఖద్వారమూ మీనము, కర్కాటకము, వృశ్చికములకు తూర్పు ద్వారము, తుల, కుంభం, వృషభములకు పశ్చిమ ద్వారము, కన్యా, మిథునం, మకరములకు దక్షిణ ద్వారము, మేష, సింహ, ధనుస్సులకు ఉత్తర ద్వారము ఉండవలెను.

**పాతిల్లు విప్పుటకు :** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ మరియు బ॥ పాడ్యమి. సోమ,బుధ, గురువారములు. అశ్విని, అరుద్రా, పుష్యమి, హస్త, స్వాతి, అనురాధా, మూల, పూషా, శ్రవణం, పుభా నక్షత్రములు శుభమ్

## గృహారంభమునకు మాసములు

మేషచైత్రం ధనలాభం, వైశాఖం వృషభ జ్యేష్ఠం శుభం. మిథున జ్యేష్ఠం మరణం. 15-6 నుండి ఆషాఢంపశుహాని, శ్రావణం సేవకాభివృద్ధి, భాద్రపదం ప్రజాపీడ, ఆశ్వీయుజం కలహం, కార్తీకధనలాభం, మార్గశిరం మహాభయం, పుష్యం అగ్ని భయం, మాఘం బహుసంపద, ఫాల్గుణం రత్న లాభములు కల్గును.సూర్యుడుకృత్తిక,విశాఖనక్షత్ర సంచారమందు ఇంటిముహూర్తములు చేయకూడదు. వృషభకలశశుద్ధి చూసుకోవలయును.(సంపత్కుమారగృహ)

## గృహ నిర్మాణమునకు వాస్తు విషయములు

గృహమునకు నాల్గు దిశల ఖాళీ స్థలము, దక్షిణం కన్నాపడమంఎక్కువ,పడమర కన్నా ఉత్తరం ఎక్కువ,ఉత్తరం కన్నా తూర్పు ఎక్కువ స్థలము విడిచి దక్షిణ పశ్చిమలు ఎత్తుగా ఉండునటులతూర్పు స్నానగదిఆగ్నేయము దక్షిణము, నైబుతి వరకు వంటగది, నైబుతి పశ్చిమ ఉత్తర దిశలయందుపడక గది, పశ్చిమమందు భోజనాలయము, తూర్పు



ముఖముగా దేవుడు ఉండునటుఉత్తరఈశాన్య దిశలలో పూజా మందిరము, ఉత్తరమున ధనధాన్యములు, డబ్బు సంబంధము ఈశాన్యమందు ఉత్తరభాగం లేక తూర్పు భాగమందు బావి త్రవ్వకొనవలెను. మరుగుదొడ్లు ఆగ్నేయం మొదలు వాయువ్య దిశలవరకు అనుకూలమును బట్టి నిర్మించుకొనవలెను. వాయువ్య ఉత్తరములందు సెప్టిక్ ట్యాంకును మేడపైననీళ్ళ ట్యాంకు పశ్చిమ నైరుతి వాయువ్యములయందును మేడమెట్లు దక్షిణపశ్చిమా వర్తనమునిర్మించుకొనిన సకల శుభములు కలుగును. (వాస్తు సారము).

## ఇంటియందుండదగిన చెట్లు (గృహకల్పద్రుమం)

గృహమందుఇంటి ఆవరణలోఅశోక,జాజి, దానిమ్మ,మారేడు,మద్ది, మల్లె, పోక, పనస, అరటి నారింజ,కొబ్బరి, ఉసిరి, వేప,తులసి, గుంటగల్జేరు, మామిడి,గంధం, పూలచెట్లుండిన ఏదోషంలేదు

**ఇంటియందు ఉండగూడని చెట్లు :** ఇంటిఆవరణయందుమోదుగు,మేడి,జువ్వి,జమ్మి, రాగి,రేగు,తుమ్మ,మొగిలి, మఱ్ఱి,జిల్లేడు,చెట్లుఉండినదోషము.

## గృహప్రవేశము చేయు విధానము

శాస్త్రోక్త విధానంగా ఇల్లుకట్టి విధిననుసరించి మంగళవాద్యములతోను, బ్రాహ్మణులు,సువాసినులు,బంధుజనులును, పూజా ద్రవ్యములతో, తెల్లనిపుష్పములుధరించి నఉత్తమ స్త్రీలును, గోవుతోను, యజమానిపత్నీ సమేతంగాపూర్ణకలశముతోకవాటమువద్ద పూజించిగృహములోనికి ప్రవేశించవలెను. తదుపరిస్వస్తివాచనాది వేద మంత్రములతో గృహశుద్ధి గావించి దేవతలను,అగ్నిని, వాస్తుపురుషుని ప్రతిష్టించి హోమాదికములాచరించిబలిప్రదానం చేయవలెను. శుభములు కోరువారువాస్తుకల్యాణంచేయవలెను.

## గృహ ప్రవేశమునకు పనికి వచ్చునవి

వైశాఖం బహుపుత్రప్రదం, జ్యేష్టం శుభప్రదం, మకర మాఘం ధాన్యవృద్ధి, ఫాల్గుణం సంపత్కరం, ఉత్తరాయణం ఇష్టసిద్ధి, పూర్ణ సోమవారం సంపద, బుధవారం ధాన్యవృద్ధి గురువారం పశుపుత్ర, సంపద, శుక్రవారం సౌఖ్యం, చిత్త అనూ, ధని, ఉత్త, ఉషా, ఉభా, రేవ, శత, రోహి, మృగశిరా శ్రేష్టములు. శ్రావణ, కార్తీక, మార్గశిరములు పుష్యమీ నక్షత్రము మధ్యమం (కాలామృతం). వృషభ కలశ శుద్ధి చూసుకోవలయును.

## గృహ ప్రవేశమునకు పనికి రానివి

ఈ సంవత్సరము మే నెల 4 నుండి 28 వరకు 6 నవంబరు నుండి 20 నవంబరు వరకును మరియు కుంభ మాసమును గృహ ప్రవేశముగాని దాని సంబంధిత పనులు గాని పనికిరావు. దక్షిణాయనం పనికిరాదు. ఆదివారం క్షీణం, సోమవారం ద్దుఃఖం, మంగళవారం అగ్ని భయం, శనివారం చోరభయం కలుగును. కృత్తిక, విశాఖలలో

సూర్యుడుండగను అశ్వి, భర, ఆర్ద్రా, ఆశ్లే, పుబ్బ, హస్త, విశా, స్వాతి, జ్యేష్ఠ, పూషా, శ్రవ, పూభా నక్షత్రములలో చంద్రుడుండగను, కుంభ మాసమందును, శు॥ 1 బ॥ 11, 13, 14, 30, భద్రకరణమును, దగ్ధ, రిక్త తిథులను అవమా త్రిద్యుస్పృక్‌లు గృహ ప్రవేశమునకు పనికి రావు.

**వాస్తు పురుష స్థితి :** భాద్రపద, ఆశ్వీయుజ కార్తీక మాసములయందు తూర్పు శిరస్సుగాను మార్గశిర పుష్య మాఘ మాసములయందు దక్షిణ శిరస్సుగాను, జ్యేష్ఠ ఆషాఢ శ్రావణ మాసములయందు ఉత్తర శిరస్సుగాను, ఎడమవైపున పరుండి యుండును గాని అతని దృష్టి ప్రసరించిన దిక్కునకు పాదములుండిన దిక్కునకు గృహమును కట్టకూడదు.

**గండ పురుష స్థితి :** వైశాఖ, ఆషాఢ, కార్తీక, ఫాల్గుణ మాసములలో నాకాశమునను చైత్ర అశ్వీయుజ భాద్రపద మాఘ మాసములలో పాతాళమునను, జ్యేష్ఠ, శ్రావణ, మార్గశిర, పుష్య మాసములలో భూమియందును గండపురుషుడు సంచరించును. భూమి యందున్నప్పుడు రజస్వల, ప్రసూతి మొదలగునవి సంభవించిన అశుభము తక్కిన ప్రదేశములనుండునప్పుడు శుభము.

**కడప పెట్టుటకు :** కరాంత్యమూలాధిపతి, పుష్య మైత్ర, దస్ర శ్రనిష్ఠా, హరిధాతృవాయు మృంగేంద్రయోర్ధ్వేమ హస్తా - రేవతీ-మూలా-పునర్వసు-పుష్యమి- అనూరాధా- అశ్వినీ - ధనిష్ఠా - శ్రవణం- రోహిణీ-స్వాతి- మృాగశిరా- చిత్తా నక్షత్రముల యందు సోమ- బుధ-గురు- శుక్ర వారములయందు కడప పెట్టుటకు శుభం.

**తిథులు :** పాడ్యమి మొదలు 1 నందా, 2 భద్రా, 3జయా, 4 రిక్త, 5 పూర్ణా, పునరావృత్తితో పౌర్ణిమామావాస్య పూర్ణ తిథులు.

## గృహారంభ గృహ ప్రవేశము శుద్ధి

సూర్యుడున్న నక్షత్రం నుండి నిత్య నక్షత్రం వరకు లెక్కించవలెను

| వబుషభ చక్రం | | | కలశశుద్ధి | | | |
|---|---|---|---|---|---|---|
| 3. శిరస్సు | ... | మృత్యుప్రదం | 1 | శిరస్సు | ... | మృత్యుప్రదం |
| 4 ముందుకాళ్ళు | ... | దురవస్థ | 4 | తూర్పుభాగం | ... | పరదేశ గమనం |
| 4 వెనుకకాళ్ళు | ... | చిరకాల శుభం | 4 | దక్షిణభాగం | ... | నిర్భయం |
| 3 తోకయందు | ... | దేశ సంచారం | 4 | పశ్చిమభాగం | ... | ధాన్యవృద్ది |
| 4 ఎడమప్రక్క | ... | ధనవృద్ధి | 4 | ఉత్తరభాగం | ... | దరిద్రం |
| 4 కుడి పార్శ్వం | ... | ధాన్యవృద్ధి | 4 | మధ్యభాగం | ... | సంతానహాని |
| 3 వృష్ట భాగం | ... | సంపద | 3 | కంఠస్థానం | ... | సంపద |
| 3 ముఖం | ... | పశువృద్ధి | 3 | క్రింది భాగం | ... | పూర్ణాయుష్యం |



**సాగు బాటుకు :** రేవతి, ఉత్తర రోహిణి, పుష్యమి, హస్త, మూల, స్వాతి, జ్యేష్ఠ, అశ్విని నక్షత్రములు, సోమ, బుధ గురు శుక్ర వారములు, కన్య, కర్కాటకము, వృషభము, మీనం, వృశ్చికము లగ్నములు పనికి వచ్చును.

**క్రొత్త పెట్టుకొనుటకు :** హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనురాధ, పుష్యమి, కృత్తిక, రోహిణి, మృగశిర, అశ్విని, మఘ, రేవతి నక్షత్రములు, ఆది సోమ బుధ గురు శుక్ర వారములు క్రొత్త ధాన్యము భుజించుటకు మంచిది.

**కాల సర్పయోగం :** జన్మలగ్నమునకు రాహు కేతు మధ్యలో సవ్యగతిని మిగతా గ్రహములన్న కాలసర్పయోగము, దీనివలన మానసిక వ్యధలు, వృత్తిలో నష్టములు, హృద్రోగములు, ఆకస్మిక కర్చులు, విద్యాభంగములు, సంతాన నష్ట కష్టములు, వివాహ ఆటంకము లేర్పడును. వీటి నివారణకు నాగ ప్రతిష్టా పన్నగభూషణుని పూజ, పుట్టపూజ, రాహుజపము హోమాంతము చేసి గోమేదికమును బంగారు ఉంగరమందు ధరించిన నివారణమగును. మరియు వారున్న స్థానములు లగ్నములననుసరించి శుభ ఫలముల కూడ నిత్తురు, వివరములకు దైవజ్ఞులను సంప్రదించగలరు.

## వాయస దోషములు

ఇంటిలోనికి కాకిగాని, గ్రద్దగాని, ద్వారము గుండా వెళ్ళినచో ఒక మాసము, కుక్క చేత తరుమబడి ఇంటిలోనికి వచ్చిన ఇంటిలో ఉండువారికి అందరికి దోషము. ద్వారం గుండా వచ్చి వేరే ద్వారం గుండా వెళ్ళినచో ఆరు మాసములు గృహ మధ్యమందు దక్షిణ భాగం ఈశాన్య, ఆగ్నేయ, నైరుతియందు పుట్టలు గాని మొండి చేతులు గాని తేనె తెట్టలుగాని మొలచినను ఇంటిలోనికి ఉడుముగాని, పైడి కట్టె, పంతరాగం, పెద్దపిట్ట కౄర పక్షులుగాని ప్రవేశించిన మృత్యు దోషము కలుగును. కావున అట్టి ఇంటిని ఆరు మాసములు విడిచిపెట్టి అనంతరము, ఉదకశాంతి, మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము చేసినచో అట్టి దోషము పరిహారమై శుభములు కలుగును.

**వాయసము :** కాకి గాని, గ్రద్దగాని, గుడ్లగూబగాని పైడికట్టె, పంతరాగం, పెద్ద పిట్ట మొదలగు క్రూర పక్షులు తాకినా, కాక మైధునం చూచినా, మోదుగ కట్టెలతో "యత ఇన్ద్రభయామహే" అను మంత్రమనుచు (1008) గాని (108) గాని చెరుహోమం చేయవలయును మరియు(101) మందికి (11) మందికిగానీ బ్రాహ్మణులకు భోజనము పెట్టిన కీడు తొలగును. (ధర్మ సింధువు)

**బల్లి, తొండ పడినందుకు :** బల్లి గాని, తొండగాని పైనబడినను తాకినను వెంటనే స్నానము చేసి పంచగవ్యప్రాశనము చేసి ఆశుభ నాశార్థం చంద్రకల్పతో మృత్యుంజయ మంత్రమును (108) మార్లు హోమము చేయవలెను. శుభవృద్ధ్యర్థం రాగి చెట్టుకు ఆంజనేయునకు (41) ప్రదక్షిణములు చేయవలెను.

## శంకుస్థాపనాది ముహూర్తముల యోగ్యమైన తిథివార లగ్న నక్షత్రాదులను తెలియజేయు చక్రము

| విషయము | తిథులు | నక్షత్రములు | వారములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|
| శంకుస్థాపన గృహారంభం | 2-3-5-7 10-13 | అశ్వి, రో, మృగ, పున, పుష్య, ఉప.హ, చిత్త, అనూ, ఉషా, శ్ర, ధని, శ, ఉ.భా., రే | బు-గు-శు | వృష, మిధు, కన్య, ధను, కుం, మీనం | చతుర్థ, అష్టమ శుద్ధి |
| గృహ ప్రవేశం | 2-3-5-7 10-13 | రో, మృ, ఉప, అనూ, ఉషా, ధని, శత, ఉ.భా., రే | బు-గు-శు | వృష, మిధు, కన్య, ధను, కుం, మీనం | చతుర్థ, అష్టమశుద్ధి, వృషభ కలశ శుద్ధి |
| కొత్తపెట్టు కొనుటకు | 2-3-5-7 10-13 | అశ్వి, రో, మృగ, ఉప, హ, ధని, మఖ, చిత్త, స్వా, అను, మూల, ఉ.భా., శ్ర, శత, రేవ | బు-గు-శు సో | వృష, మిధు, కన్య, తుల, ధను, కుం, మీనం, | లగ్న శుద్ధి, |
| గర్భాదానం | 2-3-5-7 | రో, మృ, పున, పుష్య,ఉప, హ, చి, స్వా., అనూ, మూ, ఉషా శ్రవ, శత, ఉ.భా., రే | బు-గు-శు సో | మే, వృష, కట, కన్య, తుల, ధను, మీన | 1-8 శుద్ధి, పంచవ్రత దినములు కానివి. |
| పుంసవనం | 2-3-5-7-10 10-13-15 | అశ్వి, రో, మృగ, పున, ఉప, హ, చి, స్వా, అనూ, మూ, ఉషా, శ్రవ, శత, ఉభా., రే | బు-గు-శు సో | వృశ్చి, సిం, మీన, ఇతర పుం లగ్నములు | నవ శుద్ధి 7 మాసములు 4-6-8 మాసములు |
| జాతకర్మ నామకరణం | 2-3-5-7-10 11-13 | అశ్వి, రో అనూ, పు, ఉప, హ, చి, స్వా ఉ.భా., శ్ర, ధని, శత | బు-గు-శు సో | వృష, మిధు, కట, కన్య తుల, ధను, మీనం | అష్టమ శుద్ధి పక్షచ్ఛిద్రములు కాని దినములు |
| డోలారోహణం | 2-3-5-7 10-13 | అశ్వి, రో, మృ పుష్య, ఉప, హ, చి, స్వా అనూ, ఉషా, ఉభా, రేవ | బు-గు-శు సో | వృష, మిధు, కన్య, కట, ధను, మీనం | 1-3-5 మాసములు అష్టమ శుద్ధి |
| అన్న ప్రాశనం | 2-3-5-7 10-13 | అశ్వి, రో, మృ పున, పు, ఉప, హ, చి, స్వా, అనూ, ఉషా, శ్రవ, ధని, శత, ఉభా, రే | బు-గు-శు సో | వృష, మిధు, ధను, మీన, కన్య | 10 శుద్ధి పురుషులకు సరి మాసం, స్త్రీలకు బేసి మాసం |
| కర్ణవేధ | 2-3-5-7 10-13 | అశ్వి, మృగ, పున, పు, ఉప, హ, చి, ఉషా, శ్రవధని, ఉభా, అనూ, రే | బు-గు-శు సో | వృష, మిధు, కట, కన్య, ధను, మీనం | అష్టమశుద్ధి 6-3-8 మాసములు శుభం |



| | | | | | |
|---|---|---|---|---|---|
| కేశఖండన | 2-3-5 10-13 | అశ్వి, మృగ, పున, పు, హ, స్వా, శ్ర, ధని, శత, రే | బు-గు-శు సో | వృష, మిధు, కన్య, కట, తుల, ధను, మీనం | ఉత్తరాయణ ప్రథమ యానము |
| అక్షరాభ్యాసం | 2-3-5-7 10-13 | అశ్వి, పున, పు, హ, చి, స్వా, అనూ ఆర్ద్రా, శ్ర, రే | బు-గు-శు ఆ-సో | మె, కట, తు, మక | అష్టమ శుద్ధి అనధ్యాయ రహితం |
| ఉపనయనము | 5-7-10 కృష్ణ 2-7 | అశ్వి, మృ, పున, ఉప, హ, చి, స్వాతి అనూ, ఉషా, శ్ర, ధని, , ఉభా, రే | బు-గు-శుభం ఆ-సో-మధ్య | వృష, మిధు, కట, తు, ధనుస్సు, మీనం | అష్టమశుద్ధి కేంద్రపాపగ్రహ రహితం |
| వివాహం | 2-3-5-7 10-13-15 | రో, మృ, ఉప, హ, స్వా, అనూ, మూ, ఉషా, ఉ.భా., రే | సో-శు-బు-గుశుభం ఆ-శ మధ్య | వృష, మిధు, కట తు, క, ధను, మీన | 7 శుద్ధి కేంద్రపాపగ్రహ రహితం మాఘాది పంచకం |
| నూతన వస్త్రధారణ | 2-3-5-7 10-13 | అశ్వి, రో, మృ,పుష్య,ఉప,హ,చి,స్వా,వి, అనూ, మూ, ఉషా, శ్ర, ధ, శత, ఉభా, రే | సో-బు-గు శు | వృష, మిధు, కట, కన్య తు, ధ, మీ | 8 శుద్ధిప్రదేశానధ్యాయం శుభం జ్యేష్టం మార్గశిరం మధ్యమం |
| కూపారంభం | 2-3-5-7-10 13-15 | రో, పు, మృ, ఉప, అనూ, జ్యే, ఉషా, మూ, శ్ర, ధని, శత,ఉభా,కృత్తి, పుబ్బ,పూషా,విశా | సో-బు-గు-శు మంగ | కట, మ, మీన, శుభం కుం, వృ, మధ్యమం | 3 శుద్ధి లగ్నమందు చంద్ర గురు శుక్రులు |
| ప్రయాణం | 2-3-5-7 10-13 | రో, మృ, ఉప, హ, అనూ, మూ, శ్రవ, ధని, రే | సో-గు-శు | మే, వృష, మీనం, కట, తు, ధను | ఉ, ఈ, తూ దిశలు శుభం మంగ, బుధ, శు ఎదురువాలు |
| దేవతా ప్రతిష్ఠ | 2-3-5-7-8-10- 12-13 | అశ్వి, రో, పున, పు, ఉత్తరాత్రయం,చి,స్వా, అనూ. శ్ర,ధని, శత, రే, (దేవ నక్షత్రం) | ఆ-సో-బు గు-శు | వృషసిం,మిధు,కన్యా,ధను, కుంభ, మీనం | సౌమ్య దేవతలకు ఉత్తరాయణం ఉగ్ర దేవతలకు దక్షిణాయణం |
| వాణిజ్యం | 2-3-5-10 | అశ్వి, రో, మృ, పుష్య, హ, చి, స్వా, అనూ, ఉషా, శత, రే | ఆ-బు-గు శు | కట, వృష, మిధు, కన్య, తు, ధను, మీనం | ఏకాదశ శుద్ధి పాపుల స్థితి శుభులకు కేంద్రస్థితి |

## ద్విత్వాక్షరములు (బ్రహ్మాయామిళం)

| | |
|---|---|
| ప్రహ్లాద, ప్లవన్, హ్లాదిని, క్లేష, లౌకిక — అశ్విని 4 పాదం | మృగ, మృడ, ఫణి, పౌడి, స్పందన పౌరోహిత ఉత్త 3 |
| ఐశ్వర్య ఐంద్ర — కృత్తి 1 | ప్రభాకరు, బ్రహ్మ, బ్రామరి, భ్రమరాంబ, ప్రణీత, ప్రేమ, ప్రవంతి, శ్రావణ్ — చిత్త 3 |
| వృథ, తృణ, సృవతి, ఋష్యశృంగ — కృత్తిక 3 | |
| వృష, స్వప్న, స్వాతి — రోహిణి 2 | |
| శ్వేత, వైకుంఠ — మృగశిరా1 | క్షేమ, క్షేత్రపాల — హస్త 2 |
| కృష్ణ, కృపా, క్రాంతి — మృగశిరా 3 | శ్రీనివాస్, శ్రీకాంత్ — చిత్త 4 |
| జ్ఞాన — ఆర్ద్రా 3 | సృజన్, హృష్ణ — స్వాతి 1 |
| కౌసల్య, కైక, కైంకరి, కైలాసం — పునర్వసు 1 | భారతి, భైరవుడు — పూర్వాషాఢ 1 |
| ద్రోణ, ద్రౌపతి — స్వాతి 3 | ఖుతుబుద్దీన్, ఖైరున్నీస — శ్రవణం 4 |
| స్నుష — అనూరాధ 3 | గౌతమి, గౌరి — శతభిష 1 |
| స్నేహ — అనూరాధ 3 | సౌందర్య , సౌజన్య — పూ.భా. 2 |
| శ్యామల, చ్యవన, చ్యుతి, జ్యోతి — జ్యేష్ఠ 2 | దైవజ్ఞ, ద్రాక్ష, ద్వజ, ద్యుతి — పూర్వాభాద్ర 3 |
| భీముడు — మూల 4 | |
| ధూర్జటి, ధ్వజ, ధ్యాస, ధృవ — పూర్వాషాఢ 2 | శోభ, శైలజ, శృత, కీర్తి, శివ — ఉత్తరాభాద్ర 2 |
| మౌనిక — పుబ్బ 1 | చైతన్య, చౌడన్య — రేవతి 3 |

## నూతన వధువు ప్రథమార్ధ నివాస నిర్ణయము

నూతన వధువు ఆశాఢ మాసమందు అత్తవారింట నున్నచో అత్తకు గండము, జ్యేష్ఠ మాసమందు బావకు గండం, క్షయ మాసమందు తనకే గండం, పుష్య మాసము మామకు గండం, మల మాసమందు పతికి గండం, చైత్ర మాసమందు పుట్టింట ఉన్నచో తల్లికి గండము, వారు లేనిచో దోషము లేదు. (ధర్మసిందు 402 పేజి)

## జనన మాసములకు స్త్రీ - పురుష నామములు

చైత్రము - కృష్ణుడు - భూదేవి, వైశాఖము - అనంత - కళ్యాణి, జ్యేష్టము - అచ్యుత-సత్యభామ, ఆషాఢము - చక్రీ - పున్యవతి, శ్రావణము - వైకుంఠ - రూపవతి, భాద్రపదము - జనార్ధన - ఇందుమతి, ఆశ్వీజము - ఉపేంద్ర - చంద్రావతి, కార్తీకము - యజ్ఞపురుష - లక్ష్మీ, మార్గశీర్షము - వాసుదేవ - వాగ్దేవి, పుష్యము - హరి - పద్మావతి, మాఘము - గోవింద - శ్రీదేవి, ఫాల్గుణము - పుండరీకాక్ష - సావిత్రీ.



## వివాహ అష్ట కూటములు చూచుటకు చక్రము

| ప్రథమాక్షరాలు | నక్షత్ర | వర్గు | గణం | నాడి | రాశి | అధిప | వర్ణం | జీవం | పాదం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| చు,చె,చో,ల | అశ్వి | గుఱ్ఱం | దేవ | ఆది | మేషం | కుజ | క్షత్రియ | చతు | స్వర్ణ |
| లీ,లు,లే,లో | భర | ఏనుగు | మను | మధ్య | మేషం | కుజ | క్షత్రియ | చతు | స్వర్ణ |
| అ,ఈ,ఉ,ఏ | కృత్తి | మేక | రాక్ష | పార్శ్వ | 1మే3వృ | 1కు3శు | 1క్ష3వై | చతు | స్వర్ణ |
| ఓ,వా,వీ,వు | రోహి | పాము | మను | పార్శ్వ | వృషభం | శుక్ర | వైశ్య | చతు | స్వర్ణ |
| వే,వో,కా,కి | మృగ | పాము | దేవ | మధ్య | 2వృ2మి | 2శు2బు | 2వై3శూ | 2చ2మ | స్వర్ణ |
| కూ,ఘం,జ్ఞ,ఛ | ఆర్ద్రా | కుక్క | మను | ఆది | మిథునం | బుధ | శూద్ర | మాన | రౌప్య |
| కే,కో,హాహీ | పున | పిల్లి | దేవ | ఆది | 3మి1క | 3బు1చ | 3శూ1బ్రా | మాన | రౌప్య |
| హు,హే,హో,డ | పుష్య | మేక | దేవ | మధ్య | కర్కా | చంద్ర | బ్రాహ్మ | జలచ | రౌప్య |
| డీ,డు,డే,డో | అశ్లే | పిల్లి | రాక్ష | పార్శ్వ | కర్కా | చంద్ర | బ్రాహ్మ | జలచ | రౌప్య |
| మ,మీ,ము,మే | మఖ | ఎలుక | రాక్ష | పార్శ్వ | సింహ | రవి | క్షత్రియ | వనచ | రౌప్య |
| మో,టా,టీ,టు | పుబ్బ | ఎలుక | మను | మధ్య | సింహ | రవి | క్షత్రియ | వనచ | రౌప్య |
| టే,టో,పా,పి | ఉత్త | ఆవు | మను | ఆది | 1సి3క | 1ర3బు | 1క్ష3వై | 1వ3మ | రౌప్య |
| పూ,ష,ణ,ఠా | హస్త | బఱ్ఱె | దేవ | ఆది | కన్య | బుధ | వైశ్య | మాన | రౌప్య |
| పే,పో,రా,రి | చిత్త | పులి | రాక్ష | మధ్య | 2క2తు | 2బు2శు | 2వై2శూ | మాన | రౌప్య |
| రు,రే,రో,త | స్వాతి | బఱ్ఱె | దేవ | పార్శ్వ | తుల | శుక్ర | శూద్ర | మాన | రౌప్య |
| తి,తు,తె,తో | విశా | పులి | రాక్ష | పార్శ్వ | 3తు1వృ | 3శు1కు | 3శూ1బ్రా | 3మా1కీ | లోహ |
| నా,నీ,ను,నే | అనూ | లేడి | దేవ | మధ్య | వృశ్చి | కుజ | బ్రాహ్మ | కీటక | లోహ |
| నో,యా,యీ,యు | జ్యేష్ట | లేడి | రాక్ష | ఆది | వృశ్చి | కుజ | బ్రాహ్మ | కీటక | లోహ |
| యె,యో,బా,బీ | మూల | కుక్క | రాక్ష | ఆది | ధను | గురు | క్షత్రియ | మాన | లోహ |
| బూ,ధా,భా,ఢా | పూషా | కోతి | మను | మధ్య | ధను | గురు | క్షత్రియ | మాన | తామ్ర |
| బే,బో,జా,జి | ఉషా | ముంగి | మను | పార్శ్వ | 1ధ3మ | 1గు3శ | 1క్ష3వై | మ3జ | తామ్ర |
| జు,జె,జో,ఖ | శ్రవ | కోతి | దేవ | పార్శ్వ | మకరం | శని | వైశ్య | జలచ | తామ్ర |
| గా,గి,గు,గె | ధని | సింహ | రాక్ష | మధ్య | 2మ2కు | శని | 2వై2శు | 2జ2మ | తామ్ర |
| గో,సా,సీ,సు | శత | గుఱ్ఱం | రాక్ష | ఆది | కుంభం | శని | శూద్ర | మాన | తామ్ర |
| సే,సో,దా,ది | పూభా | సింహ | మను | ఆది | 3కు1మి | 3శ1గు | 3శూ1బ్రా | మ1జ | తామ్ర |
| దు,శం,ఝా,థ | ఉభా | ఆవు | మను | మధ్య | మీనం | గురు | బ్రాహ్మ | జలచ | తామ్ర |
| దే,దో,చా,చి | రేవ | ఏనుగు | దేవ | పార్శ్వ | మీనం | గురు | బ్రాహ్మ | జలచ | స్వర్ణ |

### గణకూటములు 6

| వధూ గణము ↓ | వర గణము | | |
|---|---|---|---|
| | దేవ | మనుష్య | రాక్షస్య |
| దేవ | 6 | 6 | 0 |
| మనుష్య | 6 | 6 | 0 |
| రాక్షస | 1 | 0 | 6 |

### నాడీ కూటములు 8

| వధూ నాడీ ↓ | వర నాడి | | |
|---|---|---|---|
| | ఆది | పార్శ్వ | పార్శ్వ |
| ఆది | 0 | 8 | 8 |
| పార్శ్వ | 8 | 0 | 8 |
| పార్శ్వ | 8 | 8 | 0 |

# వివాహమైత్రి అష్టకూటమి

## 1 వర్ణకూమి జాతులు 4

| వధూ వర్ణము | వర వర్ణము | | | |
|---|---|---|---|---|
| | 1 బ్రా | 2 క్ష | 3 వై | 4 శూ |
| 1. బ్రాహ్మణ | 1 | 0 | 0 | 0 |
| 2. క్షత్రియ | 1 | 1 | 0 | 0 |
| 3. వైశ్య | 1 | 1 | 1 | 0 |
| 4. శూద్ర | 1 | 1 | 1 | 1 |

## 2 వశ్య కూటమి జీవజాతులు 1

| వధూవశ్య | వరవశ్య | | | | |
|---|---|---|---|---|---|
| | 1 చ | 2 మా | 3 జ | 4 వ | 5 కి |
| 1. చతుష్పాదం | 2 | 1/2 | 1 | 0 | 2 |
| 2. మానవ | 1/2 | 2 | 0 | 0 | 0 |
| 3. జలచర | 1 | 0 | 2 | 2 | 0 |
| 4. వనచర | 0 | 0 | 2 | 2 | 0 |
| 5. కీటకము | 1 | 0 | 1 | 0 | 2 |

## 3 తారా కూటమి తారలు 27

27 నక్షత్రములు 8 వరసలు - ప్రతి వరసకు 9 చొప్పున గణన

| వరుని తారలు → / వధువు తారలు ↓ | | | 1 అశ్వి మఖ మూ | 2 భర పుబ్బ పూషా | 3 కృత్తి ఉత్త ఉషా | 4 రో హ శ్ర | 5 మృగ చిత్త ధని | 6 ఆర్ద్ర స్వాతి శత | 7 పున విశా పూభా | 8 పుష్య అనూ ఉభా | 9 ఆశ్లే జ్యేష్ఠ రేవ | వర నక్షత్రం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మఖ | మూల | 3 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 3 | వధూ నక్షత్రం |
| భర | పుబ్బ | పూషా | 3 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 3 | |
| కృత్తి | ఉత్త | ఉషా | 1 | 11/2 | 0 | 11/2 | 0 | 11/2 | 0 | 11/2 | 11/2 | |
| రోహి | హస్త | శ్రవ | 3 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 11/2 | 3 | 3 | |
| మృగ | చిత్త | ధని | 11/2 | 11/2 | 0 | 11/2 | 0 | 11/2 | 0 | 11/2 | 11/2 | |
| ఆర్ద్రా | స్వాతి | శత | 3 | 3 | 1 | 3 | 1 | 3 | 1 | 3 | 3 | |
| పున | విశా | పూభా | 11/2 | 11/2 | 0 | 11/2 | 3 | 11/2 | 0 | 1 | 11/2 | |
| పుష్య | అనూ | ఉభా | 3 | 3 | 11/2 | 3 | 1 | 3 | 11/2 | 3 | 3 | |
| ఆశ్లే | జ్యేష్ఠ | రేవ | 3 | 3 | 11/2 | 3 | 1 | 3 | 11/2 | 1 | 3 | |

## గ్రహమైత్రి 5 — వరుని గ్రహము

| వధువు గ్రహము | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| రవి | 5 | 5 | 5 | 4 | 5 | 0 | 1 |
| చంద్ర | 5 | 5 | 4 | 1 | 4 | 1/2 | 1/2 |
| కుజ | 5 | 4 | 5 | 1/2 | 5 | 3 | 1/2 |
| బుధ | 4 | 1 | 1/2 | 5 | 1/2 | 5 | 4 |
| గురు | 5 | 4 | 5 | 1/2 | 5 | 1/2 | 1 |
| శుక్ర | 0 | 1/2 | 3 | 5 | 1/2 | 5 | 5 |
| శని | 0 | 1/2 | 1/2 | 4 | 3 | 5 | 5 |



## యోని కుటం-4 — వరుని యోని

| వదూ యోని | 1 గుఱ్ఱం | 2 ఏనుగు | 3 మేక | 4 పాము | 5 కుక్క | 6 పిల్లి | 7 ఎలుక | 8 ఆవు | 9 బర్రె | 10 పులి | 11 లేడి | 12 కోతి | 13 ముంగీస | 14 సింహం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 గుఱ్ఱం | 4 | 2 | 2 | 3 | 2 | 2 | 2 | 1 | 0 | 1 | 3 | 3 | 2 | 1 |
| 2 ఏనుగు | 2 | 4 | 3 | 3 | 2 | 2 | 2 | 2 | 3 | 1 | 2 | 3 | 2 | 0 |
| 3 మేక | 2 | 3 | 4 | 2 | 1 | 2 | 1 | 3 | 3 | 1 | 2 | 0 | 3 | 1 |
| 4 పాము | 3 | 3 | 2 | 4 | 2 | 1 | 1 | 1 | 1 | 2 | 2 | 2 | 0 | 2 |
| 5 కుక్క | 2 | 2 | 1 | 2 | 4 | 2 | 1 | 2 | 2 | 1 | 0 | 2 | 1 | 1 |
| 6 పిల్లి | 2 | 2 | 2 | 1 | 2 | 4 | 0 | 2 | 2 | 1 | 3 | 3 | 2 | 1 |
| 7 ఎలుక | 2 | 2 | 1 | 1 | 1 | 0 | 4 | 2 | 2 | 2 | 2 | 2 | 1 | 2 |
| 8 ఆవు | 1 | 2 | 3 | 1 | 2 | 2 | 2 | 4 | 3 | 0 | 3 | 2 | 2 | 1 |
| 9 బర్రె | 0 | 3 | 3 | 1 | 2 | 2 | 2 | 3 | 4 | 1 | 2 | 2 | 2 | 1 |
| 10 పులి | 1 | 1 | 1 | 2 | 1 | 1 | 2 | 0 | 1 | 4 | 1 | 1 | 2 | 1 |
| 11 లేడి | 3 | 2 | 2 | 2 | 0 | 3 | 2 | 3 | 2 | 1 | 4 | 2 | 2 | 1 |
| 12 కోతి | 3 | 3 | 0 | 2 | 2 | 3 | 2 | 2 | 2 | 1 | 2 | 4 | 3 | 2 |
| 13 ముంగీస | 2 | 2 | 3 | 0 | 1 | 2 | 1 | 2 | 2 | 2 | 2 | 3 | 4 | 2 |
| 14 సింహం | 1 | 0 | 1 | 2 | 1 | 1 | 2 | 1 | 1 | 1 | 1 | 2 | 2 | 4 |

కుక్క-లేడి, పాము-ముంగీస, సింహం-ఏనుగు, కోతి-మేక, గుఱ్ఱము-బర్రె, ఆవు-పులి, పిల్లి-ఎలుక ఇవి పరస్పర వైరములుగా గుర్తించవలెను

## రాశి కూటమి — 7 వరుని రాశులు

| వధూ రాశులు | మేషం | వృషభం | మిథునం | కర్కాటకం | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషం | 7 | 0 | 7 | 7 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 0 | 7 |
| వృషభం | 7 | 7 | 0 | 7 | 7 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 0 |
| మిథునం | 0 | 7 | 7 | 0 | 7 | 7 | 7 | 0 | 7 | 7 | 0 | 0 |
| కర్కాటకం | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 7 | 7 | 0 | 7 | 7 | 0 |
| సింహం | 0 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 7 | 7 | 0 | 7 | 7 |
| కన్య | 7 | 0 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 7 | 7 | 0 | 7 |
| తుల | 7 | 7 | 0 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 7 | 7 | 0 |
| వృశ్చికం | 0 | 7 | 7 | 0 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 7 | 7 |
| ధనస్సు | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 7 |
| మకరం | 7 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 0 | 7 | 7 | 0 | 7 |
| కుంభం | 7 | 7 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 0 | 7 | 7 | 0 |
| మీనం | 0 | 7 | 7 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 0 | 7 | 7 |

స్త్రీ రాశి నుండి పురుష రాశి వరకు లెక్కించవలెను. 2-12 మృత్యువు, 12-2 ఆయువు, 3-11 సౌఖ్యం 11-3 దు:ఖము, 4-10 ప్రీతి, 10-4 హాని, 5-9 సౌభాగ్యం, 9-5 అశుభం, 6-8 దరిద్రం, 8-6 పుత్రలాభం, 7-7 శుభం, ఈ రీతి రాశి కూటములు తెలియవలెను.

## గ్రహముల శత్రు - సమత్వ నిర్ణయ చక్రము

| గ్రహముముల | ర | చ | కు | బు | గు | శు | శ |
|---|---|---|---|---|---|---|---|
| మిత్రులు<br>సమలు | చం,కు,గు<br>బు | ర, బు<br>కు,గు,శు,<br>శ | ర,గు,చం<br>శు,శ | ర,శు<br>కు,గు,శ,శ | ర,చం,కు | బు,శ<br>కు,గు | శు,బు<br>గు |
| శత్రువులు | శు,శ | 0 | బు | ఛం | బు,శు | ర,చం | ర,చంకు |

### సమస్త కార్యములకు శుభ నక్షత్రములు

అశ్విని-రోహిణి, మృగశిర-పునర్వసు-పుష్యమి-మఘ-ఉత్తర-హస్త-చిత్త-స్వాతి-అనూరాధ-మూల-ఉషా-శ్రవణం-ధనిష్టా-శతభిషం-ఉభా-రేవతి-ఈ నక్షత్రములు శుభములు చేకూర్చును

స్ఫుటలగ్న ప్రమాణ పుష్కరాంశములు-భాగ్యనగర విషువచ్చాయ 3-37 నకు

| లగ్నము | ప్రమాణములు ఘవి. | ప్రమాణములు గ॥ని | పుష్కరాంశ ఘవి. | పుష్కరాంశ గ॥ని | లగ్నము | ప్రమాణములు ఘవి. | ప్రమాణములు గ॥ని | పుష్కరాంశ ఘవి. | పుష్కరాంశ గ॥ని |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషం | ౪గి౧ | 1-36 | ౨గి౫౦ | 1-08 | తుల | ౫గి౧౫ | 2-6 | ౪గి౧౨ | 1-41 |
| వృషభం | ౪గి౩౦ | 1-48 | ౨గి౫ | 0-50 | వృశ్చికం | ౫గి౩౦ | 2-12 | ౧గి౧౭ | 0-31 |
| మిథునం | ౫గి౧౦ | 2-4 | ౪గి౮ | 1-39 | ధనుస్సు | ౫గి౩౫ | 2-14 | 3గి౫౫ | 1-34 |
| కర్కాటకం | ౫గి౩౫ | 2-14 | ౧గి౧౭ | 0-31 | మకరం | ౫గి౧౦ | 2-4 | ౨గి౨౫ | 0-58 |
| సింహం | ౫గి౩౦ | 2-12 | 3గి౫౦ | 1-32 | కుంభం | ౪గి౩౦ | 1-48 | 3గి౫౫ | 1-34 |
| కన్య | ౫గి౧౫ | 2-06 | ౨గి౨౭ | 0-59 | మీనం | ౪గి౧ | 1-36 | ౦గి౫౫ | 0-22 |

### ఘూత చక్రము

| రాశి | తిది | వారం | నక్ష | చన్ద్ర | రాశి | తిథి | వారం | నక్ష | చన్ద్ర |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషం | షష్టి | ఆది | మఘ | 1 | తుల | ద్వాద | గురు | శత | 3 |
| వృషభం | చవితి | శని | హస్త | 5 | వృశ్చికం | దశమి | శుక్ర | రేవతి | 7 |
| మిథునం | అష్టమి | సోమ | స్వాతి | 9 | ధనస్సు | విదియ | శుక్ర | భరణి | 4 |
| కర్కాటకం | షష్టి | బుధ | అనూ | 2 | మకరం | ద్వాద | మంగ | రోహి | 8 |
| సింహం | నవమి | శని | మూల | 9 | కుంభం | చవి | గురు | ఆర్ద్ర | 11 |
| కన్య | అష్టమి | శని | శ్రవ | 10 | మీనం | తది | శుక్ర | ఆశ్లే | 12 |

| వారం | దుర్ముహూర్తం | రాహు | వారం | దుర్ముహూర్తం | రాహు |
|---|---|---|---|---|---|
| ఆది | సా4-24 | సా4-30 | గురు | 10-00, 2-48 | ప1-30 |
| సోమ | ప12-24, 2-48 | ఉ7-30 | శుక్ర | 8-24,12-24 | ఉ10-30 |
| మంగళ | ఉ8-24, 10-48 | ప3-00 | శని | ఉ 6-00, 6-48 | ఉ 9-00 |
| బుధ | ఉ11-36 | ప12-00 | | | |

**ప్రతిది ప్రారంభ సమయం దుర్ముహూర్తము 0-48 ని॥ రాహుకాలం 1-30 ని॥ ఉండును.**



## రాశికూటము (విశ్లేషణ)

వివాహమునకు వధూవరుల అష్టకూటములను చూడవలెను. ఇందులో రాశికూటము ప్రధానం, ఈ కాలములో ఎన్నోరకముల పంచాంగంలు వచ్చుటచే రాశికూటమును అస్తవ్యస్తంగా శాస్త్రప్రమాణమునకు సరిపోకుండా ఉండుటచే ఏదిప్రమాణమనే మిమాంసలో ఇబ్బందులు పడుచున్నందున వీటి ప్రామాణికతను క్రిందచూపుచున్నాను.

"ముహూర్త దర్పణం (ప్రామాణికం కాదు పేజీ **94**)"

రాశికుటం :- తృతీయేకాదశీ ద్ణుఖం, సుఖమే కాదశత్రికం అశుభంపంచ నవమే అని నప్పుడు అదే గ్రంథమందు తరువాయి శ్లో॥ ద్విద్వాదశేవా, నవపంచమేవా ఏకాధిపత్యం శుభమని వ్రాయబడినందున, నవపంచములు శుభమైనప్పుడు మళ్ళీ ఏకాధిపత్యం శుభమనుట ఎందుకు ? పుస్తకమందు ముద్రణాలోపం కావచ్చు.

"పూర్వకాలామృతం (ప్రామాణికం) **93** పేజి" శ్లో॥ 112 కన్యక జన్మరాశి మొదలు వరుని రాశి వరకు లెక్కించగా (7-7) సమసప్తములు పుత్ర ప్రదములు. ఇద్దరిది ఏకరాశియైనను శుభప్రదం, స్త్రీ రాశి మొదట పురుష రాశి వరకు 3-11 తృతీయే కాదశములను, 4-10 చతుర్ధ దశములు అశుభప్రదమనియు ఇక్కడ వినికడిలోపము (ఆ) అక్షరముద్రితమైనది తోచుచున్నది. 11-3ను 10-4గా నుండిన అశుభ ప్రదములని వ్రాయబడినది 3-11 అశుభం, 11-3 అశుభమే 10-4 అశుభం, 4-10 గూడా అశుభమనియే వ్రాసియున్నది. పైవి రెండు విధములుగా అశుభమనుటచే వీటికి పొంతనములేదు. వీటిని పరిశీలించి చూచిన తర్వాత నా పంచాగమందు అందరికి ప్రామాణి గ్రంథమగు ధర్మసింధువులో చెప్పినట్లుగా వ్రాయబడినది.

వివరము :- హిందీలిపి కాశీ శంకర సిరీస్ **186** పుస్తకం క్రీ.శ 1968 వారణాసీ శ్రీకాశీనాథ ఉపాధ్యాయగారి ధర్మసింధువును యధాతథముగా వ్రాయుచున్నాను.

"అథరాశికూటం పేజీ నెం. 436" ద్విద్వాదశకే నిర్ధనత్వం, నవ పంచమత్వేనీ పుత్రకా షష్టాష్టకే మరణం విపత్తిర్యా, ఉభయ సప్తమే, తృతీయేకాదశీ, చతుర్థదశమే శుభమ్.

తా॥ వధూవర్‌కు రాశి దూసరాయా (2-12) బారహవీ హోతో నిర్దన హోతాహై, నవీ, పంచమీ రాశీ హోతో, పుత్రకా అభావ్, ఛటీ, ఆధవీరాశి హోతోమరణం యావిపత్తీ హోతహై, దోనోంకీ సాత్‌వీ(7-7), తీసరా గ్యారహవీ (3-11), జౌర్ చౌథీ (4-10), దశ్‌వీరాశీ శుభప్రదహై॥

1930లో ముద్రితము వావిళ్ల రామస్వామి శాస్త్రుల వారిచే ప్రకటితమైన ధర్మసింధు తెలుగులిపి పేజీ నెం. 336 నందు వ్రాసినది.

## గుణముల రాసి కూటము

రెండు పంద్రెండు ఐనచో నిర్దనత్వము, తొమ్మిదవ మరియు నైదవది పుత్రులు గలుగరు, ఆరవది ఎనిమిది దినగుచో మరణమైనను విపత్తియైనను కలుగును. రెండును సమసప్తకములైనను, తృతీయము నేకాదశము నైనను, నాల్గవది, పదియవదియునైనను శుభము. ఏనిమిదవది ఆరవది ఐన ప్రీతియగును. కావున నేను రాసినది. సప్రమాణమగుటచే శంకించపనిలేదు.

నోటు:- ఈ గ్రంధములు మీ వద్ద లేనిచో పంచాంగకర్త సిద్ధాంతి వద్ద చూచుకోవచ్చును.

- బ్రహ్మభట్ల శ్రీరామశర్మ సిద్ధాంతి

కన్యనిచ్చునప్పుడు చూడవలసినవి కన్యనిచ్చునప్పుడు కులము, స్వభావము, శరీర సౌష్టవం, విద్యా, ధనము, పుంసత్యము చూచి ఇవ్వవలెను. తక్కినది విచారింపబనిలేదు.

ధర్మసింధు పేజీ 375

త్రిజ్యేష్ఠనిరూపణము. వధువరువులిద్దరున తల్లికి తొలిచూపు (ప్రథమగర్భమైన) జ్యేష్ఠమాసం వివాహం నిషిద్ధం, కన్యజ్యేష్ఠ, జ్యేష్ఠురాలైనను. లేదా వరుడు జ్యేష్ఠుడై జ్యేష్ఠా నక్షత్రమైనను, ఇరువురిరి జ్యేష్ఠలు కలిసిన జ్యేష్టమాసం వివాహం నిషిద్ధం, జ్యేష్ఠమాసమందు జన్మించినను జ్యేష్ఠమాసములో కూడదు.

ధర్మసింధువు, 375

పనికి వచ్చు ద్విర్ద్వాదశములు : (మీన, మేష) (వృష, మిథు) (కట, సిం) (కన్యా, తుల) (వృశ్చి, దను) (మక, కుంభ) వీటిలో 2-12 శుభము.

పనికి వచ్చు ఏకాదశ త్రికములు : (కర్క, వృష) (కుంభ, ధను) (మీనం, మక) వీటిలో 11-3 శుభము.

పనికి వచ్చు దశ చతుర్థకాలు : (కట, మేష) (వృష, కుంభ) (కన్యా, మిథు) (మక, తుల) (వృశ్చి, సింహ) (మీన, ధను) వీటిలో 10-4శుభము.

పనికి వచ్చు నవ పంచకములు : (కన్యా, వృష) ( తుల,మిధు) (సింహ, మేషం) (కుంభ, తుల) (వృశ్చి, కట) (ధను,సింహం) (మీనం, వృశ్చికం) వీటిలో 9-5 శుభము.

పనికి వచ్చు షష్టాకములు : (వృష, తుల) (వృశ్చి, మేష) (కట, ధను) (కన్యా, కుంభ) (మీన, సింహ) (మిధు, వృశ్చికం ) వీటిలో 6-8 శుభము.

శ్లో ॥ ద్విర్ద్వాదశేవా నవ పంచమేవా । షష్టాష్టకే రాక్షస కన్యకాయూా ।
ఏకాధిపత్యం ఉభయోసఖిత్వం । పాణిగ్రహే మంగళ మాతనోతు ॥



తా॥ ద్విర్ద్వాదశములైనను, నవపంచకములైనను, షష్టాష్టకములైనను, స్త్రీ రాక్షసమైనను, ఏకాధిపత్యమైనచో పై కూటములు దోషములు కావు.

గణ కూటములు :

శ్లో ॥ స్వగణంచోత్తమం ప్రీతి మధ్యమం దైవమానుషం । అధమందేవ దైత్యానాం।
మృత్యోర్మానుష రాక్షసమ్ ॥ స్త్రీ రాక్షసం నకర్తవ్యం । కర్తవ్యం పురుష రాక్షసమ్॥

పనికి వచ్చు రాక్షస గుణములూ ఆశ్రే, చిత్త, విశా, జ్యేష్ఠ, మూల, శత ఈ నక్షత్రములలో స్త్రీ రాక్షసమైనను దోషం లేదు. ఏకాధిపత్యమైనను, రాశి, నాడి, యోని, గ్రహమైత్రి ఇది సహజముగా శుభప్రదములైనను స్త్రీలకు గల రాక్షస గణ దోషము లేదు.

నాడీకూటమి : "భిన్ననాడి శుభావహమ్" భిన్న నాడి అయినచో శుభం.

ఆదినాడి దోష పరిహార నక్షత్రములు : ఉఫ, శత, పూభా, పున, ఆర్ద్ర, మూల, అశ్వి ఈ నక్షత్రములలో వధూవరుల నక్షత్రములుండిన దోషం లేదు.

మధ్యైకనాడి దోష పరిహార నక్షత్రములు : పూషా, అనూ, ధని, పుష్య, చిత్త, పూఫ, మృగ ఈ నక్షత్రములలో వధూవరులుండిన మధ్యైకనాడి దోషము లేదు.

పార్శ్వనాడి దోష పరిహార నక్షత్రములు : కృత్తి, ఆశ్లే, రోహి, మఘ, విశాఖ, శ్రవణ ఈ నక్షత్రములలో వధూ-వరులుండిన పార్శ్వనాడి దోషము లేదు.

ఏక నక్షత్ర ఏకపాదమైన దోషము లేని నక్షత్రములు : కృత్తిక, పున, ఆశ్లే, పూఫ, చిత్త, స్వాతి, విశా, అనూ, ఉషా, శ్రవ, రేవ ఈ నక్షత్రములలో వధూవరులకు ఏకనక్షత్ర ఏకపాదమైనను దోషం లేదు.

వధూ-వరుల ఏక నక్షత్రమైన దోషము లేని నక్షత్రములు :విశా, ఆర్ద్రా, శ్రవణ, రోహి, పుష్య రేవతి, ఉ.భా. మఘ. నక్షత్రములుండిన దోషము లేదు.

గ్రహ మైత్రము ద్విజాతీనాం । క్షత్రియాణాం గణస్తథా । కన్యాదూరంతు వైశ్యానాం।
శూద్రానాం యోని రేవచ (ముహూర్త దర్పనం 90 పేజి)

## విష కన్య:

మూలా నక్షత్రం 1-2-3 పాదము లందు పుట్టిన కన్య మామను ఆశ్లేష మొదటి పాదము విడచి తక్కిన మూడు పాదములందు జనించినది అత్తను జ్యేష్ట 4వపాదము కలిగిన యువతి బావను, విశాఖ 2వ పాదమున జన్మించిన స్త్రీ మరిదిని హరించును పై నక్షతముల యందు మిగిలిన కలిగిన దోషములేదు ఈదోషము వివాహమప్పుడే నని గ్రహించ వలయును. ఈనక్షత్రములు కలిగిన పురుషులకు వివాహమందు దోషము లేదు. పైనక్షత్రదోషములున్నచో ఆనక్షత్ర, జప, హోమాంతముచేసిన తొలిగిపోవును. ధర్మసింధు పే.జి.నం 375

## జన్మ నక్షత్రములతో చూచు కోవలసినవి :

గృహ నిర్మాణ గృహ ప్రవేశ ,పట్టబంధ,రాజ్యాభిషేక ,వ్యవసాయారంభ, ఉపనయన, అన్నప్రాశనం. భూషణ, ధారణం. వివాహమునకు, జన్మనామము చూచుకోనుట ముఖ్యము.

## నామ నక్షత్రముతో చూచుకోవలసినవి

ఊరచ్చుబాటు, గ్రామార్వణము, గృహ పథకమునకు, యుద్ధమునకు, జ్వరమునకు వ్యవహారమునకు, దూత కార్యము చేయుటకు దానం చేయునప్పుడు మంత్రమునందు, దేవతాపూజలందు, భూమి కొన్నప్పుడు జన్మనామమున్నను పేరు మాత్రమే ప్రధానము కాని జన్మనక్షత్రము కాదు.

**జన్మనక్షత్రమందు చేయుదగినవి :** నిషేకము, చౌలము, త్యాగము, అన్న ప్రాశనము, వ్యవసాయము, ఉపనయనము, ఆక్షరాభ్యాసము, పట్టాభిషేకము చేయవచ్చును. స్త్రీలకు వివాహం శ్రేష్టం కాని జన్మతార కాదు.

**జన్మ నక్షత్రమందు చేయగూడనవి :** గర్భాధానము, వివాహం, పుంసవనము, సీమంతము, ప్రయాణం, ఔషధ, సేవ, క్షౌరం చేయకూడదు.

**కృత్తిక విశాఖలో చేయకూడనివి :** చెట్టు నరుకుట, నూతన వస్త్రధారణం, గర్భదానం, కట్టితో చేయు పనులు, ఓడిబియ్యం, మట్టెలు, పుట్టు వెంట్రుకలు, స్తంభం, కడప, వ్యవసాయారంభం, గృహారంభం, కోత్త ధాన్యం భుజించుట, ఆరామ తటాక కూపములు, కోత్త బండినెక్కుట చేయకూడదు.

**వర్జ్యంలో చేయదగినవి :** స్నానము, దానము, జపము, నిత్యకర్మలు, దేవతాపూజ, ప్రాయశ్చిత్తము, భుజించుట, మల, మూత్ర విసర్జన చేయుటకు వర్జ్యదోషము లేదు.

**వివాహానంతరము చేయగూడని పనులు :** కర్ణవేధ ఉపనయనము, ఉద్యాపనలు, తీర్థయాత్రలు, పుట్టు వెంట్రుకలు, గంగాస్నానము, క్షౌరం, గయాశ్రాద్ధం, పిండ ప్రధానములు, ఆరు నెలలలోగా మళ్ళీ వివాహాది శుభకార్యములు చేయకూడదు.

**ఘాత వారమందు పనికి వచ్చునవి :** వివాహము, ఉపనయనము, పట్టాభిషేకము, సీమంతము, జాతకర్మ, పుంసవనము చేయుటకు దోషము లేదు.

**ఘాతవారమందు చేయగూడనివి :** గృహ ప్రవేశము, వ్యాపారారంభము, యాత్రలు, బావిత్రవ్వుట, ప్రయాణం చేయకూడదు.

**చేయదగినవి :** ఆషాడ, ఆశ్వీయుజ, పుష్యమాసములయందు, నామ కరణము, సీమంతము, గ్రహ శాంతులు, భూముల కొనుగోళ్లు, రిజిస్టర్లు, పెండ్లిచూపులు,



అపరకర్మలు, ఆస్తి సంచయనం, అన్నప్రాశనము చేయదగును.

భాద్రపదమాసం పితృదేవతల ఉద్దేశింపబడుటచే పితృ కర్మలు, నామకరణము, గోచార శాంతులు, ఆస్తి నిక్షేపణము చేయవచ్చును.

## తారాబలము చూచు క్రమము

| జన్మనామ నక్షత్రములు | | | 1<br>అశ్వి<br>మఖ<br>మూ | 2<br>భర<br>పుబ్బ<br>పూషా | 3<br>కృత్తి<br>ఉత్త<br>ఉషా | 4<br>రోహి<br>హస్త<br>శ్రవ | 5<br>మృగ<br>చిత్త<br>ధని | 6<br>ఆర్ద్ర<br>స్వాతి<br>శత | 7<br>పున<br>విశా<br>పూభా | 8<br>పుష్య<br>అనూ<br>ఉభా | 9<br>ఆశ్లే<br>జ్యేష్ఠ<br>రేవ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మఖ | మూల | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| భర | పుబ్బ | పూషా | 9 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| కృత్తి | ఉత్త | ఉషా | 8 | 9 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| రోహి | హస్త | శ్రవ | 7 | 8 | 9 | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| మృగ | చిత్త | ధని | 6 | 7 | 8 | 9 | 1 | 2 | 3 | 4 | 5 |
| ఆర్ద్రా | స్వాతి | శత | 5 | 6 | 7 | 8 | 9 | 1 | 2 | 3 | 4 |
| పున | విశా | పూభా | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 1 | 2 | 3 |
| పుష్య | అనూ | ఉభా | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 1 | 2 |
| ఆశ్లే | జ్యేష్ట | రేవ | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 1 |

## నిత్య నక్షత్రములు

తన పేరునకు మొదటి అక్షరము లేక ద్విత్వాక్షరము ఈ పంచాంగములో గుర్తుంచుకొని నక్షత్రం తెలుసుకొనవలెను. మనకు కావలసిన రోజు నక్షత్రం చూచి, తన నక్షత్రము నుండి ఆనాటి నక్షత్రం వరకు లెక్కించి 9చే భాగించగా వచ్చు శేషము తారాబలము. 1 జన్మతార - దేహపీడ 2 సంపత్తు - ధనాదాయము 3 విపత్తార - కార్యహాని 4 క్షేమతార - క్షేమము 5 ప్రత్యక్తార - మనస్తాపము 6 సాధనతార - కార్యసాధన 7 నైధనతార - మృత్యువు 8 మిత్రతార - సుఖసంపద 9 పరమమైత్రతార - లాభము.

2, 4, 6, 8, 9 తారలు శుభము, జన్మతారకు 7 ఘడి విడిచి శాకదానము, విపత్తుకు 3 ఘడియ విడిచి బెల్లం దానం, ప్రత్యత్తారకు 8 ఘడి విడిచి ఉప్పుదానము. నైధనకు 8 ఘడి విడిచి నువ్వులు, బంగారం దానం ఇవ్వవలెను. ఈ విధంగా తారాబలము చూడబలయును. సరి తారలు శుభము 7 తార దేనికి పనికి రాదు.

## వధూవర గుణమేలన చక్రము 18 గుణములకు తగ్గిన పనికిరాదు

| వరుడు | | మేషం | వృషభం | మిథునం | కర్కాటకం | సింహ | కన్యా | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వధువు | అశ్వి భర కృత్తి 1 | కృత్తి 3 రోహి మృగ2 | మృగ 2 ఆర్ద్రా పున3 | పున1 పుష్య ఆశ్లే | మఖ పుబ్బ ఉత్త1 | ఉత్త3 హస్త చిత్త2 | చిత్త2 స్వాతి విశా3 | విశా1 అనూ జ్యేష్ఠ | మూల పూషా ఉషా1 | ఉషా3 శ్రవ ధని2 | ధని2 శత పూభా | పూభా1 ఉభా రేవ |
| మేషం | అశ్వి భర కృత్తి 1 | 28 33 28<br>33 28 28<br>26 29 28 | 18 23 23<br>19 25 16<br>18 10 16 | 26 18 19<br>27 27 26<br>18 19 18 | 23 32 27<br>31 25 26<br>23 27 23 | 26 30 20<br>25 23 30<br>21 23 23 | 9 10 13<br>19 21 4<br>13 15 18 | 22 28 24<br>13 31 23<br>27 15 15 | 27 35 22<br>26 26 28<br>22 27 33 | 13 26 23<br>20 19 24<br>23 16 10 | 18 21 13<br>19 22 3<br>5 6 18 | 13 9 10<br>3 14 17<br>16 19 10 | 22 31 33<br>30 25 35<br>23 27 20 |
| వృషభం | కృత్తి 3 రోహి మృగ2 | 25 26 23<br>33 33 17<br>32 24 24 | 28 19 25<br>19 28 35<br>26 34 28 | 16 16 16<br>25 25 22<br>16 22 21 | 20 23 19<br>26 29 14<br>25 19 21 | 17 19 19<br>12 26 25<br>20 16 23 | 25 26 29<br>30 32 25<br>28 30 16 | 21 10 13<br>17 16 11<br>9 22 17 | 20 25 31<br>15 32 26<br>24 23 26 | 26 19 12<br>22 28 17<br>20 18 22 | 9 17 22<br>15 18 19<br>19 25 10 | 21 23 15<br>17 20 23<br>9 19 21 | 12 15 7<br>20 21 15<br>18 10 21 |
| మిథునం | మృగ2 ఆర్ద్రా పున3 | 21 12 13<br>13 21 13<br>12 19 13 | 25 32 24<br>23 33 32<br>25 29 30 | 28 32 31<br>33 28 24<br>31 25 28 | 18 11 13<br>11 20 15<br>12 20 17 | 24 21 26<br>24 30 22<br>24 28 20 | 30 31 17<br>23 26 25<br>22 25 25 | 18 32 26<br>25 34 26<br>25 33 25 | 13 11 14<br>12 19 5<br>12 20 7 | 23 19 24<br>18 30 27<br>15 28 26 | 26 31 16<br>29 31 23<br>27 31 22 | 10 21 22<br>18 12 16<br>17 12 13 | 18 10 21<br>10 21 21<br>8 18 19 |
| కర్కాటకం | పున1 పుష్య ఆశ్లే | 16 23 17<br>24 16 20<br>18 18 15 | 14 17 17<br>16 20 11<br>11 6 14 | 23 17 18<br>18 25 26<br>20 21 23 | 28 33 30<br>33 28 29<br>30 29 28 | 18 22 14<br>20 16 25<br>16 18 19 | 15 18 20<br>26 28 12<br>20 22 26 | 19 25 18<br>11 28 19<br>26 24 16 | 28 33 20<br>26 25 28<br>23 29 34 | 9 22 19<br>17 12 22<br>23 18 8 | 25 28 20<br>25 27 13<br>13 16 26 | 18 12 14<br>11 22 23<br>24 27 18 | 13 24 25<br>23 18 27<br>18 20 12 |
| సింహ | మఖ పుబ్బ ఉత్త1 | 19 19 15<br>25 17 17<br>15 22 17 | 9 4 11<br>11 18 9<br>11 17 15 | 15 15 14<br>13 22 10<br>19 14 22 | 25 28 24<br>31 25 26<br>23 34 27 | 28 30 27<br>30 28 33<br>27 33 28 | 16 17 22<br>22 22 8<br>14 15 12 | 25 18 17<br>11 25 19<br>15 26 15 | 24 27 35<br>27 23 26<br>23 34 20 | 31 26 16<br>25 23 30<br>15 31 29 | 6 8 21<br>24 21 7<br>19 21 12 | 26 27 20<br>12 21 26<br>17 11 15 | 27 20 20<br>33 26 34<br>22 35 33 |
| కన్యా | ఉత్త3 హస్త చిత్త2 | 18 27 20<br>18 27 23<br>20 12 24 | 18 23 22<br>20 24 23<br>22 18 10 | 22 17 15<br>24 17 17<br>10 18 16 | 10 21 14<br>12 22 16<br>11 5 19 | 24 30 22<br>26 30 22<br>30 16 20 | 28 26 23<br>25 28 27<br>23 26 28 | 15 26 15<br>19 28 18<br>17 18 25 | 17 27 13<br>20 28 15<br>27 11 25 | 14 28 27<br>17 29 27<br>27 13 21 | 27 30 21<br>29 31 24<br>22 23 19 | 15 9 13<br>19 10 14<br>13 23 15 | 16 28 26<br>16 29 29<br>18 10 19 |



| వరుడు | | మేషం | వృషభం | మిథునం | కర్కాటకం | సింహ | కన్యా | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | అశ్వి భర కృత్తి 1 | కృత్తి 3 రోహి మృగ2 | మృగ 2 ఆర్ద్రా పున3 | పున1 పుష్య ఆశ్లే | మఖ పుబ్బ ఉత్త1 | ఉత్త3 హస్త చిత్త2 | చిత్త2 స్వాతి విశా3 | విశా1 అనూ జ్యేష్ఠ | మూల పూషా ఉషా1 | ఉషా3 శ్రవ ధని2 | ధని2 శత పూభా | పూభా1 ఉభా రేవ |
| తుల | చిత్త2 స్వాతి విశా3 | 22 14 27<br>29 31 16<br>22 22 19 | 29 25 17<br>28 22 30<br>21 17 24 | 10 19 17<br>25 26 25<br>18 19 18 | 11 4 18<br>19 22 7<br>12 12 10 | 19 5 10<br>6 19 19<br>11 13 9 | 24 26 25<br>33 36 26<br>23 26 32 | 28 26 33<br>26 28 19<br>36 18 28 | 22 7 21<br>7 28 17<br>14 16 22 | 27 13 21<br>24 29 19<br>25 19 13 | 23 13 21<br>22 24 24<br>17 18 30 | 22 32 24<br>26 26 31<br>29 30 22 | 11 3 12<br>17 21 14<br>13 13 14 |
| వృశ్చికం | విశా1 అనూ జ్యేష్ఠ | 18 18 14<br>27 17 20<br>13 26 31 | 18 18 24<br>25 30 22<br>30 25 24 | 24 21 20<br>17 24 31<br>16 11 12 | 16 18 16<br>26 18 22<br>12 20 27 | 14 16 12<br>18 14 22<br>23 17 10 | 9 11 19<br>18 20 4<br>5 6 17 | 28 13 20<br>14 29 22<br>17 23 27 | 28 26 32<br>27 28 31<br>32 28 28 | 22 16 7<br>17 15 22<br>14 18 17 | 12 12 25<br>26 28 13<br>21 22 26 | 23 24 17<br>11 23 23<br>24 20 10 | 24 25 18<br>31 26 34<br>18 29 28 |
| ధనస్సు | మూల పూషా ఉషా1 | 19 27 30<br>34 26 23<br>31 31 17 | 18 14 13<br>11 20 11<br>4 9 15 | 21 17 13<br>19 29 28<br>24 26 26 | 15 24 31<br>31 21 26<br>28 31 16 | 23 17 9<br>18 16 23<br>8 22 21 | 6 8 19<br>20 22 5<br>19 20 13 | 19 16 19<br>5 21 13<br>13 12 5 | 29 22 22<br>24 24 26<br>15 31 25 | 28 18 26<br>28 28 34<br>27 34 28 | 14 16 20<br>25 24 7<br>13 14 19 | 29 23 15<br>16 26 30<br>22 24 28 | 16 26 26<br>31 24 33<br>29 24 28 |
| మకరం | ఉషా3 శ్రవ ధని2 | 27 27 13<br>30 29 12<br>20 11 25 | 17 22 28<br>17 24 32<br>29 26 16 | 18 21 10<br>22 22 23<br>16 15 13 | 27 29 14<br>29 28 18<br>20 13 27 | 13 27 26<br>16 28 27<br>28 14 19 | 21 23 15<br>22 24 17<br>14 16 12 | 15 15 7<br>17 16 9<br>12 13 20 | 6 21 15<br>7 23 18<br>19 6 20 | 22 30 21<br>25 31 21<br>28 15 21 | 28 26 20<br>25 28 28<br>25 27 28 | 15 17 21<br>18 20 22<br>15 22 17 | 28 31 32<br>30 31 25<br>25 16 23 |
| కుంభం | ధని2 శత పూభా | 20 11 24<br>16 22 27<br>17 15 18 | 29 25 16<br>31 27 26<br>23 32 31 | 16 25 23<br>27 19 18<br>31 24 21 | 11 4 18<br>5 15 21<br>9 18 12 | 26 12 17<br>27 21 11<br>18 26 15 | 23 25 21<br>17 17 31<br>21 23 23 | 15 19 23<br>24 19 25<br>17 25 17 | 17 4 18<br>18 16 14<br>11 18 14 | 23 10 16<br>17 20 18<br>9 24 22 | 23 25 23<br>25 27 30<br>29 31 25 | 28 32 27<br>32 28 18<br>27 18 28 | 16 7 13<br>7 16 17<br>14 21 20 |
| మీనం | పూభా1 ఉభా రేవ | 15 22 15<br>24 17 19<br>25 26 12 | 18 26 25<br>21 27 17<br>15 20 27 | 23 16 15<br>16 27 25<br>26 26 25 | 21 31 25<br>32 26 27<br>32 34 20 | 18 24 13<br>19 17 26<br>12 24 23 | 15 15 17<br>27 27 9<br>24 28 19 | 17 24 17<br>10 28 17<br>19 20 11 | 17 26 11<br>18 20 22<br>11 27 22 | 8 22 21<br>18 16 23<br>19 24 14 | 21 23 17<br>23 24 8<br>14 16 16 | 22 13 20<br>13 22 27<br>21 24 25 | 28 32 31<br>32 28 34<br>30 33 28 |

వధూవరులది ఒక నక్షత్రమైనపుడు, వధూనామము ముందుండుట అశుభం, వరనామము ముందున్నను ఒకే నామమైన శుభం.

## ఆనందాది యోగ ఫలబోదిని చక్రము ప్రయాణోపయుక్తము

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | యోగం | ఫలం |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉషా | శత | ఆనంద | ద్రవ్యలాభం |
| భర | ఆర్ద్రా | మఖ | చిత్త | జ్యేష్ట | అభి | పూభా | కాలదండ | కార్యవిఘ్నం |
| కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | ధూమ్రాక్ష | ధనహాని |
| రోహి | పుష్య | ఉత్త | విశా | పూషా | ధని | రేవ | ప్రజాపతి | కార్యసిద్ధి |
| మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉషా | శత | అశ్వి | సౌమ్యక | కార్యసిద్ధి |
| ఆర్ద్రా | మఖ | చిత్త | జ్యేష్ట | అభి | పూభా | భర | ధ్వాంక్ష | కార్యవిఘ్నం |
| పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | ధ్వజ | రాజ్యలాభం |
| పుష్య | ఉత్త | విశా | పూషా | ధని | రేవ | రోహి | శ్రీవత్స | లక్ష్మీలాభం |
| ఆశ్లే | హస్త | అనూ | ఉషా | శత | అశ్వి | మృగ | వజ్ర | కలహం |
| మఖ | చిత్త | జ్యేష్ట | అభి | పూభా | భర | ఆర్ద్రా | ముద్గర | మరణం |
| పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | ఛత్ర | రాజ్యలాభం |
| ఉత్త | విశా | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | మిత్ర | కార్యసిద్ధి |
| హస్త | అనూ | ఉషా | శత | అశ్వి | మృగ | ఆశ్లే | మానవ | స్త్రీలాభం |
| చిత్త | జ్యేష్ట | అభి | పూభా | భర | ఆర్ద్రా | మఖ | పద్మక్ష | ఐశ్వర్యం |
| స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | అంబ | భోజనలాభం |
| విశా | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | ఉత్పాత | ద్రవ్యనాశ్ణ |
| అనూ | ఉషా | శత | అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | మృత్యు | ప్రాణహాని |
| జ్యేష్ట | ఆభి | పూభా | భర | ఆర్ద్రా | మఖ | చిత్త | కాల్ణ | కార్యహాని |
| మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | సిద్ధి | కార్యసిద్ధి |
| పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | శుభం | శుభకార్యసిద్ధి |
| ఉషా | శత | అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | అనూ | అమృతం | స్త్రీ సంతోషం |
| అభి | పూభా | భర | ఆర్ద్రా | మఖ | చిత్త | జ్యేష్ట | ముసలం | భోజనహాని |
| శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | గదా | అశుభం |
| ధని | రేవ | రోహి | పుష్య | ఉప | విశా | పూషా | మాతంగ | స్వర్ణలాభం |
| శత | అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉషా | రాక్షస | క్లేశం |
| పూభా | భర | ఆర్ద్రా | మఖ | చిత్త | జ్యేష్ట | అభి | చర | దుర్వార్త శ్రవణం |
| ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | స్థితి | కార్యసిద్ధి |
| రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | పూషా | ధని | వర్ధమాన | అతిశయలాభం |

**వారశూలలు :** శని, సోమ తూర్పు, గురు దక్షిణం, ఆది, శుక్ర పశ్చిమం మంగళ, బుధ ఉత్తరం వారశూలలు ఐనందున ఆ దిక్కున ప్రయాణం పనికిరాదు. ప్రయాణమునకు పనికి వచ్చునవి:- మంగళవారం తూర్పు, సోమ, శనివారములు దక్షిణం, బుధ, గురువారం పశ్చిమం, ఆది, శుక్రవారములు ఉత్తరదిక్కునకు ప్రయాణం చేయుట శుభప్రదము.



## వివాహ వైశ్య గోత్రముల వరసలు

| వరుడు | వధువు | శుభప్రదమైనవి |
|---|---|---|
| 1. పెండ్లికుల | 1. మాసంతకుల | |
| 2. మాసంతకుల | 2. ధనకుల | ౨ - ౧ మరుదలు |
| 3. బుధనకుల | 3. వస్త్రకుల | |
| 1. పెండ్లికుల | 1. మాసంతకుల | |
| 2. శీలకుల | 2. పెండ్లికుల | ౧ - ౨ కోడలు |
| 3. ధనకుల | 3. గంధెశిల | |
| 1. పెండ్లికుల | 1. దేశెట్ల | |
| 2. గంధెశిల | 2. శీలకుల | ౩ - ౨ మేనత్త |
| 3. శీలకుల | 3. ఎలిశెట్ల | |
| 1. పెండ్లికుల | 1. ఎలిశెట్ల | |
| 2. బుధనకుల | 2. ధనకుల | ౧ - ౩ మనుమరాలు |
| 3. శీలకుల | 3. పెండ్లికుల | |

| వరుడు | వధువు | అశుభప్రదమైనవి |
|---|---|---|
| 1. పెండ్లికుల | 1. మాసంతకుల | |
| 2. బుధనకుల | 2. ధనకుల | ౩ - ౧ తల్లి |
| 3. మాసంతకుల | 3. వస్త్రకుల | |
| 1. పెండ్లికుల | 1. పెండ్లికుల | |
| 2. దెశెట్ల | 2. ధనకుల | ౧ - ౧ చెల్లెలు |
| 3. అనంతకుల | 3. వెనిశెట్ల | |
| 1. మూలకుల | 1. గంధెశిల | |
| 2. శీలకుల | 2. శీలకుల | ౨ - ౨ చెల్లెలు |
| 3. ధనకుల | 3. వెనిశెట్ల | |
| 1. బుధనకుల | 1. దేశెట్ల | |
| 2. గంధెశిల | 2. పునిగెశిల | ౨ - ౩ పుత్రిక |
| 3. వస్త్రకుల | 3. గంధెశిల | |
| 1. పునిగెశిల | 1. గంధెశిల | |
| 2. మాసంతకుల | 2. శీలకుల | ౩ - ౩ చెల్లెలు |
| 3. ధనకుల | 3. ధనకుల | |

నాయక ప్రథమంబు నారీతృతీయంబు, మానుగా గూడిన మనుమరాలు పురుషునిది మూడోది పూబోణి మొదటిది, దనరంగ గలసిన తల్లివావి పిల్లవానిది రెంట పిల్లది మూడింట బోసగజేసిన నాతి పుత్రికయగును. పరగనాథుని మూట పడుచుదిరెంటను సమరిన నామె మేనత్తయగును కూడనొక పతిసతీ రెంట కోడలగును. వరుని రెంటను సతియాది మరదయ్యె పిల్లలిద్దరు నొకటైన చెల్లెలగును. వైశ్య గోత్రంబు లీరీతి వరుసదెలసీ పెండ్లి జేసిరి తగునని పెద్దలపుడు.

# జననకాల నక్షత్ర ఫలములు శాంతులు

**ఆశ్విని నక్షత్ర జనన దోషములు :** ప్రథమ పాదమందు జన్మించిన తండ్రికిని శిశువునకు దోషము. ఈ దోషము 3 నెలల వరకు ఉండును. దోషశాంతికి నవగ్రహ జపము, నక్షత్ర జపము, సువర్ణదానము చేయవలెను. శేషించిన 3 పాదములందు జన్మించిన దోషము లేదు. నక్షత్ర దోషమునకు సామాన్య శాంతి 1-3-4 పాదముల యందు జన్మించిన వారి లక్షణములు ద్రవ్యవంతుడు, శౌర్యవంతుడు, అందగాడు, సమర్థుడు, క్రౌర్యము గలవాడు గొప్ప శరీరము గలవాడై యుండును.

భరణి నక్షత్ర జనన దోషములూ మూడవ పాదమందు జన్మించిన శిశువునకు దోషము. నక్షత్రము దోషయుక్తమగుట వలన నక్షత్ర నవగ్రహ, రుద్రాభిషేక పూర్వక శాంతి జరిపించుకొనుట ఉత్తమము. జన్మించిన వారి లక్షణములు విద్యావంతుడు, ఆరోగ్య వంతుడు, మనస్థైర్యము గలవాడు విషయ గ్రహణము గలవాడు, యదార్థముగా భాషించు వాడును, ఖచ్చితమైన నిర్ణయయు గైకొనువాడగును.

**కృత్తిక నక్షత్ర జనన దోషములు :** మూడవ పాదమందు పురుష జననమైన తండ్రికిని స్త్రీ జననమైన తల్లికిని దోషము. ఈ దోష శాంతికి నవగ్రహ నక్షత్ర జపము, రుద్రాభిషేకము, తైలావేక్షణము జరిపించుకొనవలెను. మిగతా పాదములలో జన్మించిన ఏ దోషము లేదు. లక్షణములు న్యాయశాస్త్ర మెరుంగువాడును, భోజన ప్రియుడు, అధికారము చలాయించువాడు అత్మాభిమానము గలవాడగును.

**రోహిణి నక్షత్ర జనన దోషములు :** ఈ నక్షత్ర ప్రథమ పాదంబున జననమైన మేనమామకును 2వ పాదంబున జన్మించిన తండ్రికిని, 3వ పాదంబున తల్లికిని దోషము, 4వ పాదమున ఏ దోషము లేదు. అయినను నక్షత్రము కొన్ని మతములననుసరించి దూషితమగుట వలన రుద్రాభిషేకము, నక్షత్ర, నవగ్రహ జపములు సువర్ణదానము చేయవలెను. పురుషుడు జన్మించిన మంచి రూపము గలవాడు, స్థిర అలోచన గలవాడు, అభిమానవంతుడు, సుఖ జీవనం గడుపువాడును, మంచి ప్రవర్తన గలవాడును, తేజోవంతుడు, సంభోగ ప్రియుడును స్త్రీ జన్మించిన సంతానము గలదియు సౌందర్య వంతురాలు కీర్తి ప్రతిష్టలు గలది పూర్ణాయువు గలదై యుండును.

**మృగశిర నక్షత్ర జనన దోషములు :** ఏ పాదంలో జన్మించినను ఎట్టి దోషం లేదు. పురుష జననం సంభవించిన ధనార్జనలో పైచేయిగలవాడు, శత్రువులను జయించు వాడును, చురుకైన ప్రవర్తన గలవాడు, మంచి కార్యములు చేయువాడు, కోపాధికము గలవాడును, స్త్రీ పుట్టిన రూపవతి సంతోషము గలదియు మంచి మర్యాదలు గలదియు, ధర్మపు నడక గలదియు పుత్ర సంతానము గలదియగును.

అర్ద్రా నక్షత్ర జనన దోషములు : ఏ పాదములో పుట్టినను దోషము లేదు. శుభప్రదము.



పురుషుడు జన్మించిన శూరవంతుడు, సాహస కార్యములు చేయువాడు, క్రయ విక్రయములలో ఆరితేరినవాడు కృతఘ్నుడు క్రౌర స్వభావం గలవాడు చీకూచింత లేనివాడగును, స్త్రీ జన్మించిన సతతం కలహించుకొనునది దుష్కార్యములు చేయు నదగును.

**పునర్వసు నక్షత్ర జనన దోషములు :** ఏ పాదమందైనను దోషం లేదు. పురుషుడు పుట్టిన రూపలావణ్యయుక్తుడును పరస్త్రీ కార్యములు చేయువాడు పనులందు నేర్పరి, ఆలోచించి కార్యములు సాధించువాడు, కొద్దితో తృప్తిపడువాడు శీఘ్రగమనము గలవాడు స్త్రీ పుట్టిన శాంత స్వభావము గలది తమ వారితో ప్రేమాధికము గలది, సహనము గలది, ధార్మిక కార్యములు చేయునదియగును.

**పుష్యమీ నక్షత్ర జనన దోషములు :** ప్రథమ పాదంన పుట్టిన మేనమామకు, 2,3 పాదంలలో పురుషుడు పుట్టిన తండ్రికిని, స్త్రీ పుట్టిన తల్లికి, 4వ పాదంన సామాన్య దోషం ఈ దోషం 3 నెలల వరకుండును. ఈ దోష శాంతికి తైలావేక్షణము జరిపించు కొనవలను. గంధము చెక్క దానం చేసిన శమించును, పురుషుడు పుట్టిన కామోద్రేకములు గలవాడు స్థిర బుద్ధి గలవాడు శుభ్రముగా ఉండువాడు, మంచి చదువు గలవాడును, స్త్రీ పుట్టిన రూపవతియై ధార్మిక ప్రవర్తనలో దేవబ్రహ్మణులను తృప్తి పరుచునదియగును.

ఆశ్లేష నక్షత్ర జనన దోషములూ మొదటి పాదంలో ఏ శిశువు పుట్టినను దోషం లేదు. శుభప్రదము 2వ పాదంన పుత్రీ పుత్రుల జననం ధన నష్టంను 3వ పాదంన తల్లికి, 4వ పాదంలో తండ్రికి దోషం ఉంటుంది. స్త్రీ పుట్టిన యధాశాస్త్రముగా మహాన్యాస పూర్వక రుద్రాభిషేకం నక్షత్ర నవ గ్రహ జపం మరియు పురుషుడు జన్మించిన సామాన్య శాంతి జరిపించుకొనవలెను. సువర్ణదానం చేయవలెను, పురుష జననమైన సుందరాస్యుడు సుఖ సౌఖ్యములు అనుభవించువాడు. క్రూర స్వభావము గలవాడు వ్యసనములు గలవాడును స్త్రీ జన్మించిన అధికముగా మాట్లాడునదియు క్రూర స్వభావం గలది కలహమందాసక్తి గలది యగును.

**మఘ నక్షత్ర జనన దోషములు :** మొదటి పాదంలో పుట్టిన శిశువునకు దోషం. రెండవ పాదంలో పుట్టిన తల్లికి, తండ్రికి దోషముంటుంది. 3,4 పాదంలలో పుట్టిన దోషం లేదు. మొదటి పాదంలో పుట్టిన వారికి మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము నక్షత్ర గ్రహ జపం జరిపించుకొనవలెను. అశ్వదానము చేయవలెను, పురుషుడు పుట్టిన నలుగురిలో క్రూరుడనిపించుకొనును. బలిసిన చెక్కిళ్ళుగ లవాడు, కోపాధికము గలవాడు ప్రకాశవంతుడును, వాదనలో దక్షుడు స్త్రీ పుట్టిన గౌరవ ప్రతిష్టలు కలదియు దేవతా గురుభక్తి గలదగును.

పూర్వ ఫల్గుణి నక్షత్ర దోషములు : ఏ పాదమందు పుట్టినను సామాన్య దోషము దోష శాంతికై తైలావేక్షణము జరిపించుకొనవలెను. పురుషుడు పుట్టిన ధనికుడు, ధార్మిక

స్వభావి, కార్యాకార్య విచారము గలవాడు నృత్య శాస్త్రాభిమాని. స్త్రీ పుట్టిన నలుగురితో పేరు గడించునది, సంతానం గలది, ధనవంతురాలు, శత్రువులను జయించునది అగును.

**ఉత్తర ఫల్గుణి నక్షత్ర జనన దోషములు :** 1-4 పాదములయందు పురుషుడు పుట్టిన తండ్రికిని, స్త్రీ పుట్టిన తల్లికిని దోషం. 2-3 పాదములయందు పుత్రిక, పుత్రుడు పుట్టిన సామాన్య దోషం దోష శాంతికి రుద్రాభిషేకము నక్షత్రనవగ్రహజపములు జరిపించుకోవలెను. తిలపాత్ర దాన మీయవలెను. పురుషుడు పుట్టిన శత్రువులను జయించువాడును, సుఖ సౌఖ్యాదులు అనుభవించువాడును, ధనవంతుడు స్త్రీ పుట్టిన ప్రేమగలదియు, యథార్థముగా మాట్లాడునది, ఇంటి పనులలో నేర్పరి గలదై యుండును.

**హస్తా నక్షత్ర జనన దోషములు :** తృతీయ పాదమున స్త్రీ పుట్టిన తల్లికిని, పురుషుడు పుట్టిన తండ్రికిని దోషము. మిగతా 1-2-4 పాదములయందు పుట్టిన వారికి ఏ దోషం లేదు. ఈ సామాన్య దోష శాంతికై తైలావేక్షణము జరిపించవలెను. పురుషుడు పుట్టిన విద్యావంతుడు, ధనవంతుడు, పరులకు మేలు చేయువాడు, సౌఖ్యవంతుడు, ధైర్యసాహసం గలవాడు, స్త్రీ పుట్టిన శీల, గుణ, సౌందర్యవతి, గౌరవ ప్రతిష్టలు గలదై యుండును.

**చిత్తా నక్షత్ర జనన దోషములు :** 1-2 పాదములలో పురుషుడు పుట్టిన తండ్రికిని, స్త్రీ పుట్టిన తల్లికి దోషము. ఈ దోషశాంతికి మహాన్యాస రుద్రాభిషేకము, నవగ్రహ జపం జరిపించుకొనవలెను. శేషించిన 4వ పాదంన పుట్టిన సామాన్యదోషం కలదు. వస్త్ర దానమీయవలెను, పురుషుడు పుట్టిన వస్త్రధారణలో అభిలాషగలవాడును, ప్రయాణములతో సమయాన్ని హెచ్చుగా వెచ్చించువాడు,ధనవంతుడు, భోగభాగ్యములను అనుభవించువాడు, స్త్రీ పుట్టిన రూపవతి, ఆభరణములు ధరించునది, సౌఖ్యములను అనుభవించునదియగును.

**స్వాతి నక్షత్ర జనన దోషములు :** ఏ పాదంలో పుట్టినను ఎట్టి దోషం లేదు. పురుషుడు జన్మించిన ధర్మప్రవర్తన గలవాడు, వ్యవహారములలో పైచేయు గలవాడు విద్యావంతుడు, ధైర్య సాహసములు గలవాడు, స్త్రీ పుట్టిన కీర్తి ప్రతిష్టలు గడించునది, మంచినడవడిక గలదై యుండును.

**విశాఖ నక్షత్ర జనన దోషములు :** ఏ పాదంలో పురుషుడు పుట్టిన బావమరిదికి లేదా మదరలికి స్త్రీ పుట్టిన ఎడల మరిదికి దోషం కలదు. దోష శాంతికై మహాన్యాస రుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహ జపములు తైలావేక్షణము జరిపించుకొనవలెను. పురుషుడు పుట్టిన సూక్ష్మంగా విచారించువాడును, ఓర్వలేని తనం గలవాడు, ఇంద్రియ



నిగ్రహం గలవాడును, దయాదాక్షిణ్యము గలవాడును, స్త్రీ పుట్టిన మనోహర శరీరము గలది, బంధువులయందు ప్రేమగలది, తీర్థయాత్రలయందు అభిలాష గలదై యుండును. అనూరాధ నక్షత్ర జనన దోషములూ ఏ పాదములో పుట్టినను దోషం లేదు. శుభప్రదము, పురుషుడు పుట్టిన శూరత్వము గలవాడు, విదేశములలో యుండువాడు, రాజకీయ కార్యములందాసక్తి చూపువాడు, రూపవంతుడు, స్త్రీ పుట్టిన ఉపకారము చేయునది, తగిన స్నేహితులు గలది, సౌందర్యవంతురాలుగా వుండును.

**జ్యేష్టా నక్షత్ర జనన దోషములు :** ఏ పాద మందు పుట్టిన దోషాదిక్యం కాన యధావిదిగా మహాన్యాస రుద్రాభిషేకము, నక్షత్ర నవగ్రహ జపములు తైలావేక్షణము జరిపించు కొనవలెను. గోదానమీయవలెను, పురుషుడు పుట్టిన ధనవంతుడు, శ్రమలనోర్చువాడు, అసత్యమందు జంకువాడు, స్త్రీ జన్మించిన అధిక ప్రేమగలదియు, కోపాధికం గలదై యుండును.

**జ్యేష్టా నక్షత్ర గండములు :** జ్యేష్టా నక్షత్రాద్యంత ఘడియలను 10 భాగములుగా జేయగా ఒక్కొక్క భాగమునకు ఈ విధంగా ఫలితములు చూచుకొనగలరు, 1వ భాగమున తల్లికిని, 2వభాగమున తల్లియెక్క తండ్రికి, 3వ భాగమున తండ్రి సోదరులకు, 4వ భాగమున శిశువు తల్లికిని, 5వ భాగమున శిశువునకు, 6వ భాగమున వంశీయులకు, 7వ భాగమున మామకు, 8వ భాగమున మేనమామకు, 9వ భాగమున ఆత్మబంధువులకు, 10వ భాగమున సమస్తములకును దోషము.

**మూలా నక్షత్ర జనన దోషములు :** ప్రథమ పాదమందు జననమైన తండ్రికిని, ద్వితీయ పాదమైన తల్లికిని, తృతీయ పాదంన ధననాశనము, నాల్గవ పాదములందు పురుషుడు పుట్టిన స్వల్ప దోషము, స్త్రీ పుట్టిన తల్లిపక్షం వారికి దోషం. ఈ దోష నివారణకు యధాశాస్త్రంగా మహాన్యాసపూర్వక రుద్రాభిషేకము, నక్షత్ర నవ గ్రహ జపములు, తైలావేక్షణము, మహిషదానము చేయవలయును, పురుషుడు పుట్టిన ధనవంతుడు, ఆత్మాభిమానం గలవాడు, సౌఖ్యవంతుడు, ధర్మ శాస్త్ర ప్రవర్తన గలవాడు, బంధువుల నాదరించువాడు, స్త్రీ పుట్టిన విద్యా ధనం గలదియు, స్వల్ప సౌఖ్యము గలదై యుండును. మూల నక్షత్ర (12) గండములూ మూల నక్షత్ర ఆద్యంతములను 12 భాగాలుగా చేసి ఫలితం చూచుకొనవలెను. 1వ భాగం తండ్రికిని, 2వ భాగం తల్లికిని, 3వ భాగంన సోదరులకు, 4వ భాగం ఆడతోబుట్టులకు, 5వభాగం మేనమామకు,6వ భాగం తండ్రి తోబుట్టువులకు, 7 వ భాగం ధననాశనము,8వ భాగం పినతండ్రికిని, 9వ భాగం శిశువునకు, 10వ భాగం దరిద్రం, 11వ భాగం సంపద,12వ భాగం లాభము.

పూర్వాషాఢ నక్షత్ర జనన దోషములూ తృతీయ పాదంన పురుషుడు పుట్టిన తండ్రికి, స్త్రీ పుట్టిన తల్లికి దోషము. ఈ దోషశాంతికి రుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహ జపములు జరిపించుకొనవలెను. మిగతా 1-2-4 పాదములయందు పుట్టిన స్వల్ప దోషము సామాన్య శాంతి చేయవలెను. పురుష జననమైన వినయ విధేయతలు గలవాడు, ప్రసన్నవదనుడు, త్యాగగుణము గలవాడు, అభిమానవంతుడు, స్త్రీ జన్మించిన ఆదరాభిమానము గలదియు, విశాలమైన నేత్రములు గలదై యుండును.

**ఉత్తరాషాఢ నక్షత్ర జనన దోషములు :** ఏ పాదంలో పుత్రికా పుత్రులు పుట్టినను దోషం లేదు, పురుషుడు పుట్టిన ధార్మికుడు, విశ్వాస యోగ్యుడు, సంతానము గలవాడు, సౌందర్యవంతుడు, మంచి భార్య గలవాడు, స్త్రీ పుట్టిన అనురాగ పూరిత మనస్సు గలదియు, భోగభాగ్యములను అనుభవించునదై యుండును.

**శ్రవణా నక్షత్ర జనన దోషములు :** ఏ పాదంలోనైనా పుత్రికా పుత్రులు పుట్టిన దోషం లేదు. పురుషుడు పుట్టిన పాండిత్యము గలవాడు, ఉదార స్వభావం గలవాడు వాదనలో సమర్థుడు విజయం పొందువాడు. స్త్రీ జన్మించిన ధర్మ ప్రవర్తన గలదై యుండును. దానధర్మములు చేయునదై యుండును.

**ధనిష్టా నక్షత్ర జనన దోషములు :** పుత్రికాపుత్రుల జననము ఏ పాదములో జరిగనను దోషం లేదు. పురుషుడు పుట్టిన దురలవాట్లు గలవాడు, క్రూర స్వభావం గలవాడు, అపవాదులు చేయువాడు స్త్రీ జన్మించిన ఇతిహాసములందు ఆసక్తి గలది, తోటి స్త్రీలు నాదరించునది ధర్మ ప్రవర్తన గలదై యుండును.

**శతభిషా నక్షత్ర జనన దోషములు :** పుత్రికాపుత్రుల జననము ఏ పాదములో జరిగనను దోషం లేదు. పురుషుడు పుట్టిన కపటము గలవాడు, దుష్టుడు, సుందరాస్యుడు, భార్యయందు ప్రేమాధిక్యము గలవాడు, స్త్రీ పుట్టిన దేవతా గురుభక్తి గలదియు ఇంటి పనులలో నేర్పరియై యుండును.

**పూర్వాభాద్ర నక్షత్ర జనన దోషములు :** ఏ పాదంలో పుత్రికా పుత్రులు జననమైన దోషం, సామాన్య శాంతి జరిపించుకొనవలెను. పురుషుడు పుట్టిన దురలవాట్లు గలవాడు, పరస్త్రీలయందాసక్తి గలవాడు, తరచుగా అవకతవకలు గలవాడు, స్త్రీ పుట్టిన ధనవంతురాలును,దైవభక్తి గలది, సత్సంతానము గలదియు, వినయ విధేయత ప్రవర్తన గలదై యుండును.

**ఉత్తరాభాద్ర నక్షత్ర జనన దోషములు :** ఏ పాదంలో పుట్టిన దోషం లేదు. పురుషుడు పుట్టిన సంతానం గలవాడు, ధార్మిక కార్యముచేయువాడు,శత్రువులను జయించువాడు, స్త్రీ పుట్టిన గౌరవ ప్రతిష్టలు గలది ఓర్పుగలదై యుండును.

**రేవతి నక్షత్ర జనన దోషములు :** మొదటి మూడు పాదములలో పుత్రికా పుత్రులు



జన్మించిన ఎట్టి దోషం లేదు. నాల్గవ పాదంలో పుత్రుడు పుట్టిన తండ్రికి, శిశువునకు, స్త్రీ జన్మించిన తల్లికిని, శిశువునకు దోషం. ఈ దోష శాంతికి నక్షత్ర నవగ్రహ జపము, రుద్రాభిషేకము జరిపించుకొనవలెను. సువర్ణ దాన మీయవలెను. పురుషుడు పుట్టిన ధనవంతుడు, నలుగురిలో పేరు సంపాదించువాడును, సౌందర్యవంతుడును, స్త్రీ పుట్టిన శారీరక పుష్టి గలదై, ఆచారవంతురాలై యుండును.

## జననకాల తిథి దోషములు

5-6-10 తిథులయందును బహుళ చతుర్థియందును తిథిని 6 భాగాలుగా చేయగా 1 భాగము శుభము, 2 తండ్రికిని, 3 తల్లికిని, 4 మేనమామకు, 5 అన్నదమ్ములకు, 6 శిశువునకు దోషమును, మరియు అమావాస్య తిథిని 6 భాగములు చేసిన 1 ధనహాని, 2 తల్లికిని 3 తండ్రికిని, 4 అన్నదమ్ములకు, 5 గోవులకు,6 శుభమనియు మిగతా తిథి దోషము వర్జ్యదుర్ముహూర్తములందుజననమైన తండ్రికిని దోషం. ఇవికాక గ్రహ, బాలారిష్ట దోషాదులు, దైవజ్ఞులగు పురోహితులచే తెలుసుకొని తగిన విధముగా శాంతి చేసి సువర్ణ, తండుల దానంలు చేసిన సకల శుభములు చేకూరును.

**ఇతర దోషములు :** తండ్రి యొక్క నక్షత్రమందు శిశువు పుట్టిన వాడు తండ్రిని గాని జ్యేష్టభ్రాతనుగాని చంపును. తండ్రి నక్షత్రమందు పుట్టిన వానికి మూల నక్షత్రము వలె శాంతి ఆచరించి బ్రాహ్మణులకు భూమి, రత్నములు, బంగారం, అన్నదానం చేయవలెను.

(ధర్మసింధు 207)

## వర్గోత్తమ హంశలు

చు-వా-హ-హి-మో-పో-రా-నె-బె-బో-సీ-చి పైవి మొదటి అక్షరముగల జన్మనామము వర్గోత్తమ హంశలగును. వీరలు సదా సుఖముగా నుందురు.

## బాలారిష్టములు

జన్మ లగ్నములు 5 రవి, 8 చంద్రుడు, 7 కుజుడు, 4 బుదుడు, 3 గురువు, 6 శుక్రుడు, 1 శని, 9 రాహువు, 12 కేతువులుండిన బాలారిష్ట దోషములు.



## జననకాల దశను తెలుసుకొనుట

కృత్తిక నుండిజన్మ నక్షత్రము వరకు లెక్కించి 9చే భాగించినా, రవి, చంద్ర, కుజ, రాహు, గురు, శని, బుధ, కేతు, శుక్ర దశలగును. మళ్ళీ పై క్రమము ప్రారంభమగును.

| నక్షత్రములు | దశ | సం | ధరించు రత్నములు |
|---|---|---|---|
| అశ్వి, మఘ, మూల | కేతుదశా | 7 సం॥ | వైఢూర్యము |
| భర, పుబ్బ,పూషా | శుక్రదశా | 20 సం॥ | వజ్రము |
| కృత్తి, ఉత్త, ఉషా | సూర్యదశా | 6 సం॥ | మాణిక్యం |
| రోహి,హస్త, శ్రవ | చంద్రదశ | 10 సం॥ | ముత్యము |
| మృగ, చిత్త, ధని | కుజదశ | 7 సం॥ | పగడము |
| ఆర్ద్రా, స్వాతి, శత | రాహుదశ | 18 సం॥ | గోమేధికము |
| పున, విశా, పూభా | గురుదశ | 16 సం॥ | పుష్యరాగం |
| పుష్య, అనూ, ఉభా | శనిదశ | 19 సం॥ | నీలమణి |
| ఆశ్లే, జ్యేష్ట, రేవ | బుధదశ | 17 సం॥ | మరకతం (పచ్చ) |

## అంశములను తెలియజేయు చక్రము

| | అశ్వి | భర | కృత్తి | రోహి | మృగ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్లే | అంశాదిపతి | ఫలం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప్రథమాంశపాదం | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | కుజుడు | చోర: |
| ద్వితియాంశపాదం | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | శుక్రుడు | భోక్త: |
| తృతీయాంశపాదం | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | బుధుడు | బుద్ధిమంతుడు |
| చతుర్థాంశపాదం | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | చంద్రుడు | ధనవంతుడు |

| | మఖ | పుబ్బ | ఉత్త | హస్త | చిత్త | స్వాతి | విశా | అను | జ్యే | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| పంచమాంశపాదం | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | సూర్యుడు | రాజు |
| షష్టమాంశపాదం | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | బుధుడు | పుంసకుడు |
| సప్తమాంశపాదం | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | శుక్రుడు | జయంకలవాడు |
| అష్టమాంశపాదం | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | కుజుడు | దరిద్రుడు |

| | మూల | పూషా | ఉషా | శ్రవ | ధని | శత | పూభా | ఉభా | రేవ | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| నవమాంశపాదం | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | గురువు | కార్యశూరుడు |
| దశమాంశపాదం | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | శని | దుష్టకర్ముడు |
| ఏకాదశాంశపాదం | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | శని | క్షుద్రుడు |
| ద్వాదశాంశపాదం | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | గురువు | విద్యావంతుడు |



## ప్రశ్నా ప్రకరణం

శ్లో॥ మేషే మానుష చింతాచ వృషభే పశు చింతనం మిథునే గర్భ చింతాచ కర్కటే వ్యవహారిక సింహేతురాజ చింతాచ కావ్య చింతాచ కన్యకా తులా యంధాతు చింతాచలోహం వృశ్చిత రోగ చింతనం అర్ధ చింత ధనుర్లగ్నం, మకరే వ్యాధి చింతనం, కుంభేచ గృహ చింతాచ మీనేచ గమన చింతనం ॥

## చోర ప్రశ్న

శ్లో॥ మేషేతు బ్రాహ్మణశ్చోరో, వృషేక్షత్రియ ఉచ్యతే చోరస్సు మిథునే వైశ్యో శూద్రశ్చోరస్తు కర్కటే సింహేచ స్వజనశ్చోరో, కన్యాయాంతు వరాంగనా పురతోవాభ్రాతరోదాసీ, తులాయాం తస్కరా స్మృత: భృత్యశ్చ వృశ్చికో చోరో, ధనుర్లగ్నే సమీపత: మకరే గృహమద్యేతు కుంభే చోరస్తు మూషక: మీనేతు ధరణి స్థా:మితి చోర నిరూపణం

## నష్ట వస్తుప్రశ్న

శ్లో॥ మేషే పూర్వదిశాప్రోక్త వృషభే దక్షిణ స్తథా మిథునే పశ్చిమే చైన కర్కటే చోత్తరా॥ ధనుస్సింహేతు ఆగ్నేయం, కన్యా మకర నైఋతి తులా కుంభేచ వాయువ్యం, ఈశాన్యం మీన వృశ్చికం

## కార్య ప్రశ్న

శ్లో॥ అజ, హరి, ధన్వసు కార్యవిడంబం, మకర సువృశ్చిక కర్కటనాశం, తుల వృషకుంభే కార్యసిద్ధి, కన్యామీనే మిథునే శీఘ్రం ॥

## ప్రశ్న చూచే విధానం

సీ॥ అడిగిన నక్షత్రమది కృత్తి కాదిగా ముని సంఖ్య పర్యాయ మొనర బుచ్చి॥ తచ్చేష మొకటైతే స్థానముందే యున్నాడు, మానుగ రెండైతె మరలివచ్చు॥ ఒప్పుగా మూడైతె ఒసర పయనము జేయు, నాల్గు మిగిలనెనేని వాడె వచ్చు॥ ఐదు మిగిలేనేని అప్పుడే వచ్చును, ఆరు మిగిలినేని అతడు రోగి, ఏడు మిగులేనేని ఏతెంచు చున్నాడు ప్రశ్న భావ మిట్లు పలుకవలెను.

## గ్రహ మైత్రి తెలుసుకొనుటకు

మ=మిత్రుడు, స=సముడు, ర=శత్రువు నుండి క్రమముగా

మా, మా, సోమా, రి, రం, భా, మి, మి, స, మి, శ,శ, భానునకు గుర్తించవలెను.

స, మ, సి, సు, సు, మ, చ, చంద్రునకు

రా, మ, సీ, సం, మ, మా, కు, కుజునకు

సో, మం, సా మం, ర, స, జ్ఞ బుధునకు

ర, స, మ,మ, మ,ర,గు గురునకు

మా, ర రా శీ మ శాం శు శుక్రునకు

రే, రీ, రా, మా, స, మాం, శ శనికి

## నవగ్రహములు శుభ ఫలములనిచ్చు స్థానములు

శ్లో॥ షట్త్రిదశస్తోభానుః షడ్దశజన్మ త్రిసప్తక శీతాంశుః
ద్విఅష్టచతుర్దశదజ్ఞః గురురద్వీర్న వపంచమే శుభఫలదా॥

కవి రగ దశ షడ్వర్జ్యః కుజభానుజ రాహుకేతు షట్త్రిదశస్థాః

| | | | |
|---|---|---|---|
| రవి- | 3-6-10-11 | స్థానములు | శుభం |
| చంద్ర- | 1-3-6-7-10-11 | స్థానములు | శుభం |
| కుజ- | 3-6-10-11 | స్థానములు | శుభం |
| బుధ- | 2-4-8-10-11 | స్థానములు | శుభం |
| గురు- | 2-5-7-9-11 | స్థానములు | శుభం |
| శుక్ర- | 1-2-3-4-5-9-11-12 | స్థానములు | శుభం |
| శని- | 3-6-10-11 | స్థానములు | శుభం |
| రాహు-కేతు | 3-6-10-11 | స్థానములు | శుభం |

## గ్రహచారము లనుకూలముగా లేనప్పుడు చేయవలసిన జప, హోమ, దానములు (జ్యోతిస్సారే)

శ్లో॥ రవేసప్తసహస్రాని। చంద్రికా దశస్తథా భౌమే దశసహస్రాని। బుధే శ్రుతి సహస్రకం ఏకోనవింశతి శ్శౌరి। భార్గవే షోడశస్తథా త్రయోవింశతి మందేచ। రాహు దష్టా దశస్తథా కేతుసప్త సహస్రేచ। జపసంఖ్య ప్రకీర్తితా ॥

సూర్యుడు : శ్లో॥ జపాకుసుమ సంకాశం కాశ్యపేయం మహాద్యుతిం
తమోరిం సర్వ పాపఘ్నం ప్రణతోస్మి దివాకరం ॥

బీజాక్షరం : ఓం హ్రాం హ్రీం న్హ సూర్యాయ నమ్హ (7000) వేలు జపము ఎర్రని వస్త్రము గోధుమలు దానం చేయవలెను. జిల్లేడు కట్టెతో హోమము.

చంద్రుడు : శ్లో॥ దధిశంక తుషారాభం క్షీరోధారణ సంభవం
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణం ॥

బీజాక్షరం : ఓం శ్రాం శ్రీం శ్రోం న, చంద్రాయనమ్హ (11,000) వేలు జపం తెల్లని వస్త్రము, బియ్యం దానమీయవలెను. మోదుగు కఱ్ఱతో హోమం.

కుజుడు : శ్లో॥ ధరణీ గర్భ సంభూతం విద్యుత్కాంచన సన్నిభం
కుమారం శక్తి హస్తంచ మంగళం ప్రణమామ్యహం ॥

బీజాక్షరం : ఓం క్రాం క్రీం న్హ భౌమాయనమ్హ (10,000) వేల జపము రక్త వస్త్రం కందులు దానం చేయవలెను. చంద్ర కర్రతో హోమం.

బుధుడు : శ్లో॥ ప్రియంగు గుళికాభాసం రూపేణ ప్రతిమాంబుధం
సౌమ్యం సర్వగుణోపేతం నమామి శశి నందనం ॥

బీజాక్షరం : ఓం బ్రాం బ్రీం నం బుధాయనమ్హ (4,000) వేల జపము పెసర్లు ఆకుపచ్చ బట్ట దానం చేయవలెను. ఉత్తరేణి కఱ్ఱతో హోమం.

గురుడు : శ్లో॥ దేవానాంచ ఋషీనాంచ గురుకాంచన సన్నిభం
వందనీయం త్రిలోకానం తన్నమామి బృహస్పతి ॥

బీజాక్షరం : ఓం హ్రాం హ్రీం హ్రోం నం బృహస్పతయే నమ్హ (19,000) వేల జపము పసుపుచ్చ బట్ట, శనగలు దానమీయవలెను, రావి కఱ్ఱతో హోమము

శుక్రుడు : శ్లో॥ హేమకుంద మృణాలాభం దైత్యానాం పరమం గురుం
సర్వ శాస్త్ర ప్రవక్తారం బార్గవం ప్రణమామ్యహం ॥

బీజాక్షరం : ఓం ద్రాం ద్రీం న్హ శుక్రాయనమ్హ (16,000) వేల జపము శ్వేత వస్త్రము, బబ్బెర్లు దానము చేయవలెను, మేడికఱ్ఱతో హోమము.

శని : శ్లో॥ నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజం
చాయామార్తాండ సంభూతం తన్నమామిశనైశ్చరం ॥

బీజాక్షరం : ఓం భ్రాం భ్రీం భ్రైం న్హ శనయే నమ్హ (23,000) వేల జపము నీలం వస్త్రము, నువ్వులు దానము చేయవలెను. జమ్మి కఱ్ఱతో హోమం.

రాహువు : శ్లో॥అర్ధకాయం మహావీరం చంద్రాదిత్య నిమర్ధనం
సింహికా గర్భ సంభూతం తంరాహుం ప్రణమామ్యహం ॥ బీజాక్షరం
ఓం భ్రాం భ్రం భ్రౌం నమ్హ రాహవేనమ్హ (18,000)వేల జపము నల్లని వస్త్రము మినుములు దానము చేయవలెను. గరికతో హోమము.

కేతువు : శ్లో॥ పాలాశ పుష్ప సంకాశం తారకాగ్రహమస్తకం
రౌద్రం రుద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహం॥

బీజాక్షరం : ఓం ప్రాం ప్రీం ప్రౌం న్హ కేతవేనమ్హ (7,000) వేల జపము, చిత్రవర్ణపు వస్త్రము, ఉలువలు దానము చేయవలెను. దర్భతో హోమము.

# దశాంతర్దశలు

| అంతర్దశ | రవి దశ 6 సం॥లు | | చంద్ర దశ 10 సం॥లు | | కుజ దశ 7 సం॥లు | |
|---|---|---|---|---|---|---|
| | కాలం | మొత్తంకాలం | కాలము | మొత్తంకాలం | కాలము | మొత్తంకాలం |
| | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు |
| సూర్య | 0-3-18 | 0-3-18 | – | – | – | – |
| చంద్ర | 0-6-0 | 0-9-18 | 0-10-0 | 0-10-0 | – | – |
| కుజ | 0-4-6 | 1-1-24 | 0-7-0 | 1-5-0 | 0-4-27 | 0-4-27 |
| రాహు | 0-10-24 | 2-0-18 | 1-6-0 | 2-11-0 | 1-0-18 | 1-5-15 |
| గురు | 0-9-18 | 2-10-6 | 1-4-0 | 4-3-0 | 0-11-6 | 2-4-21 |
| శని | 0-11-12 | 3-9-18 | 1-7-0 | 5-10-0 | 1-1-9 | 3-6-0 |
| బుధ | 0-10-6 | 4-7-24 | 1-5-0 | 7-3-0 | 0-11-27 | 4-5-27 |
| కేతు | 0-4-6 | 5-0-0 | 0-7-0 | 7-10-0 | 0-4-27 | 4-10-24 |
| శుక్ర | 1-0-0 | 6-0-0 | 1-8-0 | 9-6-0 | 1-2-0 | 6-0-24 |
| రవి | – | – | 0-6-0 | 10-0-0 | 0-4-6 | 6-5-0 |
| చంద్ర | – | – | – | – | 0-7-0 | 7-0-0 |

| అంతర్దశ | రాహు దశ 18 సం॥లు | | గురు దశ 16 సం॥లు | | శని దశ 19 సం॥లు | |
|---|---|---|---|---|---|---|
| | కాలం | మొత్తంకాలం | కాలం | మొత్తంకాలం | కాలం | మొత్తంకాలం |
| | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు |
| రాహు | 2-8-12 | 2-8-12 | – | – | – | – |
| గురు | 2-4-24 | 5-1-6 | 2-1-18 | 2-1-18 | – | – |
| శని | 2-10-6 | 7-11-12 | 2-6-12 | 4-8-0 | 3-0-3 | 3-0-3 |
| బుధ | 2-6-18 | 10-6-0 | 2-3-6 | 6-11-6 | 2-8-9 | 5-8-12 |
| కేతు | 1-0-18 | 11-6-18 | 0-11-6 | 7-10-12 | 1-1-9 | 6-9-21 |
| శుక్ర | 3-0-0 | 14-6-18 | 2-8-0 | 10-6-12 | 3-2-0 | 9-11-21 |
| రవి | 0-10-24 | 15-5-12 | 0-9-18 | 11-4-0 | 0-11-12 | 10-11-3 |
| చంద్ర | 1-6-0 | 16-11-12 | 1-4-0 | 12-8-0 | 1-7-0 | 12-6-3 |
| కుజ | 1-0-18 | 18-0-0 | 0-11-6 | 13-7-6 | 1-1-9 | 13-7-12 |
| రాహు | – | – | 2-4-24 | 16-0-0 | 2-10-6 | 16-5-18 |
| గురు | – | – | – | – | 2-6-12 | 19-0-0 |

| అంతర్దశ | బుధ దశ 17 సం॥లు | | కేతు దశ 7 సం॥లు | | శుక్ర దశ 20 సం॥లు | |
|---|---|---|---|---|---|---|
| | కాలం | మొత్తంకాలం | కాలం | మొత్తంకాలం | కాలం | మొత్తంకాలం |
| | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు | సం-నెల-రోజు |
| బుధ | 2-4-27 | 2-4-27 | – | – | – | – |
| కేతు | 0-11-27 | 3-4-24 | 0-4-27 | 0-4-27 | – | – |
| శుక్ర | 2-10-0 | 6-2-24 | 1-2-0 | 1-6-27 | 3-4-0 | 3-4-0 |
| రవి | 0-10-6 | 7-1-0 | 0-4-6 | 1-11-3 | 1-0-0 | 4-4-0 |
| చంద్ర | 1-5-0 | 8-6-0 | 0-7-0 | 2-6-3 | 1-8-0 | 6-0-0 |
| కుజ | 0-11-27 | 9-5-27 | 0-4-27 | 2-11-0 | 1-2-0 | 7-2-0 |
| రాహు | 2-6-18 | 12-0-15 | 1-0-18 | 3-11-18 | 3-0-0 | 10-2-0 |
| గురు | 2-3-6 | 14-3-21 | 0-11-6 | 4-10-24 | 2-8-0 | 12-10-0 |
| శని | 2-8-9 | 17-0-0 | 1-1-9 | 6-0-3 | 3-2-0 | 16-0-0 |
| బుధ | – | – | 0-11-27 | 7-0-0 | 2-10-0 | 18-10-0 |
| కేతు | – | – | – | – | 1-2-0 | 20-0-0 |



# జనన తేదీలకు అదృష్ట వారములు, నెలలు, రంగులు మొదలగున్నవి

| జనన తేది | అదృష్టతేది | వారములు | నెలలు | రంగులు | రత్నాలు<br>కేరపు | లోహములు<br>బంగారం |
|---|---|---|---|---|---|---|
| 1-10-19<br>28-31 | 14-10<br>'19-22<br>23-24 | ఆది,సోమ | మార్చి<br>ఆగస్టు<br>అక్టోబర్ | ఎరుపు<br>పసుపు<br>తెలుపు | ఎల్లో<br>డైమండ్<br>ముత్యం | రాగి |
| 2-11-20<br>-29 | 14-2-7<br>10-11-13<br>16-19-20<br>22-25-28<br>29-31 | ఆది,సోమ<br>శుక్ర | ఏప్రిల్,మే<br>జూన్,జూలై<br>నవంబర్ | లేత పసుపు<br>తెలుపు | వైక్రాంతం | రాగి<br>బంగారం |
| 3-12-21<br>-30 | 3-6-9-12<br>15-18-21<br>24-27 | గురు,<br>మంగళ | ఫిబ్రవరి<br>జూన్,<br>సెప్టెంబర్<br>డిసెంబర్ | ఎరుపు<br>పసుపు<br>పచ్చ | పుష్యరాగం<br>గోమేధికం | వెండి<br>సీసం |
| 4-13-22<br>-31 | 1-2-4-7<br>10-11-16<br>19-20-23<br>25-29 | ఆది,సోమ | జూన్<br>జూలై | డార్క్ | గోపంచితం<br>రంగు | కంచు |
| 5-14-23 | 5-14-23<br>1-4-14<br>15-19-22<br>28-31 | బుధ,శుక్ర | ఆగస్టు<br>జూలై | ఆకుపచ్చ<br>బ్రౌన్ | పచ్చ | అల్యుమినియం<br>గాజు |
| 6-15-24 | 6-15-24<br>3-9-12<br>18-21-27<br>30 | శుక్ర,గురు<br>మంగళ | మే,<br>అక్టోబర్ | తెలుపు<br>బ్లు | రవ్వ<br>పగడం | బంగారం<br>వెండి<br>ప్లాస్టిక్<br>పాలరాయి |
| 7-16-25 | 7-4-11<br>20-22-25 | ఆది, సోమ | ఏప్రిల్,మే<br>జులై,మార్చి<br>జూన్,అక్టోబర్,<br>సెప్టెంబర్,<br>నవంబర్,<br>డిసెంబర్ | తెలుపు<br>ఆకుపచ్చ<br>చంద్రకాత<br>మిశ్రమ | వైడుర్యం<br>ముత్యం | పింగాణి<br>లక్క |
| 8-17-26 | 8-17-28<br>5-6-14<br>15-23-24<br>28 | ఆది,శని<br>శుక్ర | జన,ఫిబ్ర<br>డిసెంబర్<br>తప్ప మిగితవి<br>మంచివి | నీలి,<br>ముదురు<br>ఆకుపచ్చ | ఇంద్రనీలం | ఇనుము<br>స్టీల్<br>రాళ్ళు |
| 9-18-27 | 3-6-9-12<br>15-18-21<br>27 | శుక్ర,గురు<br>మంగళ | మార్చి,<br>ఏప్రిల్,<br>జూన్<br>సెప్టెంబర్ | ఎరుపు | పగడం<br>కెంపు<br>గోమేధికం | రాగి,కంచు<br>పంచలోహాలు<br>రాగిపాత్రలు |

## నవరత్నముల మహిమ మరియు ధారణా చక్రము

| క్ర.సం | రత్నముల పేరు | జన్మ నక్షత్రము | మహిమ |
|---|---|---|---|
| 1 | కెంపు | కృత్తిక, ఉత్తర, ఉ.షా. | ధన సంపత్తి, నాక్పటిమ, జ్ఞాపక శక్తి హృదయ రోగ నివారణ |
| 2 | ముత్యం | రోహిణి, హస్త, శ్రవణం | మనశ్శాంతి, వీర్యావృద్ధి, ధైర్యము, కుష్ఠ క్షయ, ఉబ్బసము, మేహ వ్యాధి నివారణ, స్త్రీలకు బహిష్ఠ దోషములు తొలగను. |
| 3 | పగడం | మృగశిర, చిత్త, ధనిష్ట | ధుష్ట శక్తుల నివారణ, గుండె జబ్బు నివారణ, సఖ్యతకుశ దోష నివారణకు, ధైర్యము, మిలటరీ, పోలీసు శాఖలలో ఉద్యోగం, ఉన్నత పదవులు లభించును. |
| 4 | పచ్చ | ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి | గౌరవము, సుఖము, సద్బుద్ధి, గణిత శాస్త్ర ప్రజ్ఞ వ్యాపారాభివృద్ధి, జ్ఞాపక శక్తి. |
| 5 | పుష్యరాగము | పునర్వసు, విశాఖ, పు.భా. | పాండిత్యము, విద్య, సత్కర్మలు, వంశవృద్ధి, ప్రజాభిమానము, సభాపూజ్యత, ఉద్యోగం, జీర్ణశక్తి, దైవభక్తి, మేధా శక్తి, ఆరోగ్యం. |
| 6 | వజ్రం | భరణి, పుబ్బ, పూ.షాడ | సంగీతము, సాహిత్యము, స్త్రీ, సుఖము, నటన, భోగములు, సుఖములు సంతానము, వీర్యవృద్ధి, ఆరోగ్యం సంపత్తు, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. |
| 7 | నీలం | పుష్యమి, అనూ, ఉ.భా | కారదక్షత, వ్యాపార, ఉద్యోగ వృద్ధి, వివాహము మానసిక బాదలు తొలగును. |
| 8. | గోమేధికం | ఆరుద్ర, స్వాతి, శతభిషం | కాల సర్పయోగ నివారణ, చర్మ వ్యాధులు, తొలుగును. విద్యానుకూలత, ఆర్థిక పుష్ఠి. వృత్తి లాభము, స్త్రీ మూలక ధన ప్రాప్తి, ఆరోగ్యము, ఆకస్మిక ప్రమాదాల నివారణ. |
| 9. | వైఢూర్యం | మఖ, మూల, అశ్విని | కార్యసిద్ధి, వాహన ప్రాప్తి, మనఃస్థిరత, దేవతానుగ్రహము, మంత్ర సిద్ధి, సర్వ దోష పరిహారము, జనాధరణ, అధికారం కలుగును. |



## సంవత్సర సూతకములో చేయకూడనివి

మాతాపిత్రాదులు స్వర్గస్థులైన ఒక సంవత్సరం లోపు తీర్థశ్రాద్ధము యుగాది శ్రాద్ధములు, వివావా ఉపనయనాది సమస్త శుభకార్యములు చేయకూడదు. మృతుని కుమార్తె వివావాం మాత్రం చేయవచ్చును. అపకర్షణ (యేడువుడి) చేయవలెను.

## మృత సూతకములు: ధర్మ ప్రవృత్తి 151 పేజీ

తండ్రి మరణించిన ఒక సంవత్సరము, తల్లి మరణించిన ఆరు మాసములును, భార్య మరణించిన మూడు మాసములు, సోదర పుత్రులు మరణించిన మూడు పక్షములును, సపిండులకు ఒక మాసము, ఆశౌచము ఉండును.

## మృత విషయమై దుష్ట తిథి- వార నక్షత్రములు

1-4-6-8-12-13-14-30 ఈ తిథుల యందును, ఆది, మంగళ, శుక్రవారముల యందు కృత్తిక, రోహిణి, మృగ, పున, మఘ, ఉప, చిత్త, విశా, ధని, శత, పూభా, ఉభా, రేవతి ఈ నక్షత్రముల యందు మృతి సంభవించిన గృహమునకు దోషము. కేవలం తిథి వల్ల ధోషం లేదు. తిథి, వారం వల్ల, స్వల్ప దోషము తిథి నక్షత్రం వల్ల అర్ధ దోషము, వారనక్షత్రము త్రిపాదదోషము. తిథి వార నక్షత్రముల వలన సంపూర్ణదోషము కలుగును. మృగశీర్ష, చిత్త, ద్విపాద నక్షత్రంలు ఈ నక్షత్రములయందు మృతి సంభవించిన 3 మాసములును, కృత్తి, పున, విశా, ఉషా ఇవి త్రిపాది నక్షత్రములయందు 4 మాసములున్ను, భర, రోహి, మఖ యందును ధని, శత, పూభా, ఉభా, రేవతి యందు 6 మాసములును గృహమును వదలవలయును. ధనిష్టకు 6 మాసాలు, శతతార 3 మాసాలును పూర్వాభాద్రకు 3 పక్షములును ఉత్తరాభాద్రకు 2 పక్షములును రేవతికి 1 పక్షమున్ను వదల వలయును. ఉభా 2 పక్షములును రేవ 1 పక్షం వదల వలయునను కొందరి అభిప్రాయం సరియైనది కాదు.

## మృత విషయ కర్మాదులు

మాతాపిత్రాదులు ఏకకాలమందు (మరణించినను) ప్రమాదవశాత్తుగా మృతి చెందినను ఇరువురికి వేరువేరు వాహనములతో తీసుకోపోయి ఒకే కాష్టంమందైనను మద్యలో దర్భను అడ్డముగా ఉంచి దహించవలయును. వేరువేరు ఐనచో ముందుగా పితృ సంస్కారము చేసి తర్వాత మాతృ సంస్కారము చేయవలెను. ఇటులనే కర్మ అంతయు తండ్రికి చేసిన తర్వాత తల్లికి సపిండీకరణం వరకు చేయవలెను. మాసికమును పక్వము వేరువేరుగా చేసి తండ్రి మాసికానంతరం తల్లి మాసికము ఆచరించి మాతృ శేషమును అఘ్రాణించి (వాసనచూచి) పితృ శేషమును భుజించవలెను. ఇటులనే

ప్రత్యబ్దములు కూడా ఆచరించవలెను. మాతాపిత్రాదుల మృతాశౌచమందుయే ఇతర జాతశౌచ మృతాశౌచములు వచ్చినను ఆచరించవలచిన అవసరం లేదు. జ్ఞాతుల ద్వారా కలుగు మృతాశౌచములయందు తనకు ఎటువంటి జాతమృతాశౌచము కలిగినచో తనకు కలిగిన ఆశౌచమే ఆచరించవలెను. తండ్రి మరణించిన తర్వాత ఎప్పుడైనను తాత మృతి చెందిన పితామహునకు తన తండ్రి ఒక్కడే కూమారుడైనచో ప్రేతాది సమస్త కర్మలు సంవత్సర విమోకము వరకు చేయవలెను. తండ్రి దశహం లోగా తాత మరణించనచో కర్తృత్వము కలిగిన ముందు తండ్రికి దశాహం చేసి తాత దశహం ఆగు వరకు కర్మను ఆపవలెను. కర్తలు వేరైన దశాహం ఆపకూడదు.

## శ్రాద్ధ ఫలం

పితృ దేవతలు దేవలోకంలో ఉన్న అగ్ని హోత్రము చేతను స్వర్గ మందు బ్రాహ్మణ భోజనము చేతను యమలోకంలో ఉన్న పిండ ప్రదానముల చేతను నరక మందున్న ఉపపిండము వికిర పిండము చేతను మానవ లోకమందున్న దక్షిణల చేతను రాక్షస జన్మమందున్న విశేష అన్నదానము చేతను తృప్తి నొందుదురు. పిశాచాది స్వరూపులైన వికిరాన్నముచేతను వృక్షాదిరూపముగానున్న స్నాన, వస్త్ర ఉదక దానాదులచేతను తృప్తిపొందుదురు ఇట్లు గాక వారు గంధర్వులై జీవించియున్న భోగ్యరూపమై పశువులై జన్మించియున్న గడ్డిరూపమై సర్పముగాన్న వాయిరూపమై రాక్షసులైయున్న మాంసరూపమున పేత్రరూపులై యుంటే రక్తము గాను మనుష్య జన్మలో ఉంటే అన్నాది రూపము చేతను మనము ఆచరించిన శ్రాద్ధఫలితము మృతులకు చెందును.

## పక్ష శ్రాద్ధము

రవికన్యలో ప్రవేశించిగానే యముడు సకల జీవులను భూలోకంలోనికి పంపును. వారు తమ వంశస్థులుగాని, బంధుమిత్రులుగాని, ధర్మాచరణపరులుగాని తమకు శ్రాద్ధాదులాచరింతురేమోనను ఆశతో సంచరించిన కర్మ చేయబడిన సమస్త జీవులు ఉల్పాపాత భూకంపాది భీభత్సమృతులు ఆనాథలు శ్రాద్ధఫలం పొంది వారు ఆచరించిన వారికి సమస్త సుఖములు కలుగునట్లు ఆశీర్వదింతురు. మరియు సప్త గోత్రముల వారి 101 వంశీయులు కూడా తరింతురు. తండ్రి తిథియందు లేక తల్లి తిథియందు లేదా ద్వాదశీ ఆమావాస్యయందుగాని పక్షాశ్రాద్ధ, పక్షశ్రాద్ధము ఆచరించవలెను. కాని మాతాపిత్రాదుల తిథిని ఏ పరిస్థితులలో కూడా విడవకూడదు. పక్షములోనే తిథి సంభవించిన తిథి ఆచరించి మరుసటి దినమున పక్షము ఆచరించవలెను. సితృతిథి శ్రేష్టము, మాతృతిథి మధ్యమం మిగతా ప్రతినెల తిథియందు కూడా బ్రాహ్మణ భోజనం పెట్టవలెను గాని శుభకార్యములు చేయరాదు.



## కాశీ శ్రాద్ధ సంకల్పం

పూర్వోక్త సంకల్పం పరిత్వా, ప్రాచీనావీతీ, అస్మత్ పితౄణాంఅక్షయ్య పుణ్యలోక ఫలావాప్త్యర్థం, శ్రీవారణాసీక్షేత్రే, భాగీరథీ తీర్థాఖ్య హిరణ్య శ్రాద్ధం కరిష్యే ॥

## ప్రయాగ సంకల్పం

ఏవం ప్రీత్యర్థం, శుభే శోభనేముహూర్తే.........మేరోర్ధక్షిణ దిగ్భాగే, వింధ్య స్తోత్తరే ప్రదేశే, ఆర్యావర్తైకదేశే, విష్ణు ప్రజాపతిపక్షేత్రే, పటస్యపూర్వదేశే షట్కూల మధ్యే, అంతర్వేద్యాం, భాగీరథ్యా పశ్చిమేతీరే, త్రివేణీ సంగమే, మాధవక్షేత్రే, విక్రమశకే, బౌద్దావతారే, బార్హస్పత్యమానేన..........సంవత్సరే, ఆయనే మాసే, తిథౌ-అస్మిన్ వర్తమాన వావహారిక చాంద్రమానేన...........శుభతిథౌ

## గయా సంకల్పం

భరతవర్షే, మేరోరక్షిణ దిగ్భాగే, ఆరావర్త అంతర్గత మగధదేశే, చంపకారణ్యే, మధువనే కోలాహలపర్వతే, గయా గదాధర క్షేత్రే, విష్ణుపాదే, పటక్షేత్రే, ఫల్గునీనదీతీరే బార్హస్పత్యమానేన.......అస్మిన్వర్తమాన వ్యావహారిక చంద్రమానే.........శుభతిథౌ, సమస్త పాపక్షయద్వారా పితృప్రీతర్థ్యం, ఫల్గుణీ నదీస్నానముహం కరిష్యే.

## పక్షశ్రాద్ధ సంకల్పం

పుణ్యతిథౌ ॥ యజమానస్య పితు: గోత్రస్య, శర్మణ్ణ వసురూపస్య

కన్యాగతే సవితరి ఆషాఢ్యాది పంచన హోపరపక్షక సకృన్మహాలయాఖ్యాన్న శ్రాద్ధే ॥ ధూర్వవిలోచన సౌంజక్షా

కాశీ, గయా, ప్రయాగ, పుష్కర గంగా, పక్షశ్రార్ధములకు నిత్యతర్పణ విధి ప్రకాశం ఆవాహన, అర్చనము కంఠభూపువిధానంగా పిండప్రదానం జరుపవలెను.

## దర్భలవివరములు

ప్రథమాచే పంచదర్భై ప్రత్యబ్దే సప్తభిస్తదా మహాలయే నవదర్భైళ్చ, ఇత్యైతేకూర్చలక్షణం మాసికములు ప్రథమాబ్దంవరకు 5 దర్భలు, ప్రతి సంవత్సరములందు 7 దర్భలు, మహాలయాది తీర్థశ్రాద్ధమందు, 9 దర్భలచేకూర్చ చేయవలయును.

## విశ్వేదేవరులు 13 మంది

**శ్లో॥ఇష్టిశ్రాద్ధేక్రతు దక్షౌ నాందీముఖే సత్యవసకౌ । సైమిత్తికేకామ,కాతౌ।తీర్థేధూర్వ,విలోచనౌ॥ పార్వణేపురూరవార్ద్రవౌ। హేమశ్రార్థే ధను, రుచౌ॥ ఏకోద్దిష్టే రుద్రసంజ్ఞా: దివిదేవా: ప్రకీర్తితా॥**

**వివరణ :** యజ్ఞయాగములయందును, పుత్రకామేష్టి పౌర్ణిమా సేష్టయందు, దక్ష, క్రతువులుగాను, శుభకార్యమునాందీ శ్రాద్ధమందు, సత్య, వసువులనియు తీర్థ శ్రాద్ధములందు, ధూర్వ, విలోచననిలయమును పార్వణమందు, పురూరవ ఆర్ద్రవలనియు, సపిందీకరణమందు కాల, కామకులనియు, హిరణ్యశ్రాద్ధమందు ధను, రుచులుగను, ఏకొద్దిష్టమందు రుద్రుడుగాను పూజింపబడుదురు.

## ధర్మపిండాలు

1) పితృవంశే మృతాయేచ గతిర్యేషాం నవిద్యతే ।
తేషాముద్దర ణార్ధాయ ఇమం పిండం దదామ్యహం

2) మాతృవంశే మృతాయేచ గతిర్యేషాం నవిద్యతే ।
తేషామద్దరణార్ధాయ ఇమంపిండం దదామ్యహం

3) అస్మత్కులే మృతాయేచ గతిర్యేషాం నవిద్యతే ।
తేషామద్దరణార్ధాయ ఇమంపిండం దదామ్యహం

4) బంధువార్గాశ్చ యేకేచిన్నామగోత్ర వివర్జిత్ణా
స్వగోత్రే పరగోత్రేవా తేషా........... ......దదామ్యహం

5) ఉద్బంధన మృతాయేచ విషశస్త్ర హతాశ్చయే ।
శృంగిభి ర్దంష్టిభి ర్యాపితేభ్య తేషా.........దదామ్యహం

6) అగ్నిదగ్దా మృతాయేచ। సింహవ్యాఘ్ర హతాశ్చయే।
ఆత్మఘాతి పునాయేచ తేభ్య తేషా......................దదామ్యహం

7) రౌరవే బాంధతామిశ్రే కాలసూతేచయేహతా ।
తేషాముద్దరణార్ధాయ.................దదామ్యహం

8) అసిపత్రవనేఘోరే కుంభే పాకేచ రౌరవే ।
తేషాముద్దరణార్ధాయ......................దదామ్యహం

9) అసంఖ్యయాతనాసంస్థా తర్జితా యమకింకరై ।
తేషముద్దరణార్ధాయ...............దదామ్యహం

10) పశుశృంగ గతాయేచ పక్షికీటకశీసృపాః ।
అధవావాక్షాయోనిష్టా తేభ్యః తేషామద్దరణర్ధాయ ఇమంపిండం దదామ్యహం



## నిత్యపితృతర్పణం

**ఆచమ్య ! ప్రాణానాయమ్య ! ఓం భూ: ..........పుణ్యతిథౌ అస్మత్ పితౄన్ ఉద్దిష్య పితృ ప్రీత్యర్థం అక్షయ పుణ్యలోకావాప్త్యర్థం నిత్య పితృ తర్పణం కరిష్యే (ప్రాచీనావీతి).**

1. పితరం-గోత్రం-శర్మాణ, వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
(ఈవిధముగానే ప్రతీ ఒక్కరికి 3 మార్లు పితృతీర్థము ద్వారా తర్పణమును వదులవలెను)
2. పితామహం-గోత్రం-శర్మాణం, రుద్రరూపం, స్వధాసమస్తర్పయామి ॥3॥
3. ప్రపితామహం-గోత్రం-శర్మాణం, ఆదిత్య స్వధాసమస్తర్పయామి ॥3॥
4. మాతరం-గోత్రాం-దాయిూం, వసురూపాం,స్వధానమస్తర్పయామి ॥3॥
5. పితామహీం-గోత్రాం-దాయిూం, రుద్రరూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
6. ప్రపితామహీం-గోత్రాం-దాయిూం, ఆదిత్యరూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
7. సాపత్నీమాతరం-గోత్రాం-దాయిూం, వసురూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
8. జననీం-గోత్రాం-దాయిూత, వసురూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
9. మాతామహం-గోత్రం-శర్మాణం, వనరూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
10. మాతుపితామహం-గోత్రం-శర్మాణం,రుద్రరూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
11. మాతుప్రపితామహం గోత్రం-శర్మాణం,ఆదిత్యరూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
12. మాతామహీం-గోత్రాం-దాయిూం-వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
13. మాతు పితామహీం-గోత్రాం-దాయిూం-రుద్రరూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
14. మాతుప్రపితామహీం-గోత్రాం-దాయిూం-ఆదిత్యరూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
15. ఆత్మపత్నీం-గోత్రాం-దాయిూం-వసురూపాం,స్వధానమస్తర్పయామి ॥3॥
16. సుతం-గోత్రం-శర్మాణం-వసురూపం,స్వధానమస్తర్పయామి ॥3॥
17. భ్రాతరం-గోత్రం-శర్మాణం-వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
18. తత్పత్నీం-గోత్రాం-దాయిూం, వసురూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
19. పితృవ్యం-గోత్రం-శర్మాణం-వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
20. తత్పత్నీ-గోత్రాం-దాయిూం-వసురూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
21. తత్పుత్రం-గోత్రం-శర్మాణం-వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
22. తత్పత్నీం-గోత్రాం-దాయిూం-వసురూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
23. మాతుల-గోత్రం-శర్మాణం-వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
24. తత్పత్నీం-గోత్రాం-దాయిూం-వసురూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
25. దుహితరం-గోత్రాం-దాయిూం-వసురూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
26. ఆత్మభగినీం-గోత్రాం-దాయిూం-వసురూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥

27. తద్భర్తారం-గోత్రం-శర్మాణం-వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
28. దౌహిత్రం-గోత్రం-శర్మాణం, వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
29. తత్పత్నీం-గోత్రాం-దాయీం, వసురూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
30. భాగినేయకం-గోత్రం-శర్మాణం,వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
31. తత్పత్నీం-గోత్రాం-దాయీం, వసురూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
32. పితృభగినీం-గోత్రాం-దాయీం-వసురూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
33. తద్భర్తారం-గోత్రం-శర్మాణం-వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
34. మాతృభగినీం-గోత్రాం-దాయీం-వసురూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
35. తద్భర్తారం-గోత్రం-శర్మాణం-వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
36. జామతరం-గోత్రం-శర్మాణం-వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
37. స్నుషాం-గోత్రాం-దాయీం-వసురూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
38. శ్వశురం-గోత్రం-శర్మాణం-వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
39. తత్పత్నీం-గోత్రాం-దాయీం-వసురూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
40. శ్యాలకం-గోత్రం-శర్మాణం-వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
41. తత్పత్నీం-గోత్రాం-దాయీం-వసురూపాం, స్వధానమస్తర్పయామి ॥3॥
42. స్వామినం-గోత్రం-శర్మాణం-వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
43. సఖాయం-గోత్రం-శర్మాణం-వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
44. గురుం-గోత్రం-శర్మాణం-వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥
45. రిక్థినం-గోత్రం-శర్మాణం-వసురూపం, స్వధానమస్తర్పయామి ॥3॥

## తీర్థక్షేత్రములందు, గయలో పెద్దలకు పిండములు పెట్టు క్రమము

అదౌపితాతథా మాతా సాపత్నీ జననీతథా మాతా మహాస్సపత్నీకా ఆత్మపత్నీ స్త్వనంతరం! సుతభ్రాతృపితృవ్యాశ్చ మాతులాస్సహభార్యకా!దుహితా భగనీచైవ దౌహిత్రోభాగినేయక పితృష్వసా మాతృష్వసా జామతా భావుకాస్నుషా శ్వశురస్స్యాల కోచైవ స్వామినో గురురర్థిన పితృణాం పశ్చిమే భాగే మాతృపిండం యధాక్రమం, మాతామహాశ్చతత్పూర్వం ఆత్మపత్నిస్తదుత్తరం సుత భ్రాతృపితృవ్యాశ్చ మాతో పిత్రోశ్చ మధ్యమే !

మాతామహామహీ మధ్యేమాతులాస్సహభార్యకా:
దుహితాదితతోన్యేషాం శేషం దక్షణతో విధి : !



| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | పితృ | 16. | భ్రాతు | 31. | పితృభగిన్తీ |
| 2. | పితామహ | 17. | తత్పత్నీ | 32. | తద్భరా |
| 3. | ప్రపితామహ | 18. | తత్పుత్ర | 33. | మాతృభగినీ |
| 4. | మాతృ | 19. | పితృవ్య | 34 | తద్భర్తా |
| 5. | పితామహి | 20. | తత్పత్నీ | 35 | జామతా |
| 6 | ప్రపితామహి | 21 | తత్పుత్ర | 36 | భావుక |
| 7 | సాపత్నిజనని | 22 | మాతుల | 37 | తత్పత్నీ |
| 8 | మాతామహ | 23 | తత్పత్నీ | 38 | స్నుషా |
| 9 | మాత పితామహ | 24 | దుహిత | 39 | శ్వశుర |
| 10 | మాతు ప్రపితామహ | 25 | భగినీ | 40 | తత్పత్నీ |
| 11 | మాతమహి | 26 | తద్భర్తు | 41 | శ్యాలక |
| 12 | మాతు పితామహి | 27 | దౌహిత్ర | 42 | తత్పత్నీ |
| 13 | మాతప్రపితామహ | 28 | తత్పత్నీ | 43 | స్వామీ |
| 14 | ఆత్మపత్ని | 29 | భాగినేయ | 44 | సఖా |
| 15 | సుత | 30 | తత్పత్నీ | 45 | గురు |
| | | | | 46 | ఆచార్య |

